# భారత జాతీయోద్యమ సంగ్రహ చరిత్ర



రచన: మానికొండ సుబ్బారావు





విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-2.

I

# పరిచయం

ఈ సంగ్రహ చరిత్ర ముఖ్యంగా పామీదత్తు, హీరేన్ ముఖర్జీలు వ్రాసిన 'నేటి భారతదేశం', 'భారతదేశ స్వతంత్ర పోరాటం' అను గ్రంథాలను ఆధారంగాతీసుకొని వ్రాయబడింది.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు వర్తకం చేసుకునే మిషతో భారతదేశానికి వచ్చారు. ఆంతరంగిక పరిస్థితుల నుపయోగించుకొని, దేశీయ పరిపాలకుల మధ్య తంపులు పెట్టి, అధికారం చేబట్టి వలసదేశంగా పరిపాలన సాగించారు. ఈ వలస దోపిడీని యథేచ్ఛగా కొనసాగిస్తూ వచ్చిన బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలనకు వ్యతిరేకంగా స్వతంత్రంకోసం జరిగిన పోరాటమే మన జాతీయోద్యమ చరిత్ర. కాంగ్రెసు పుట్టుకనుండీ యీ జాతీయోద్యమం ఒకరూపం దాల్చి పురోగమించింది. అయితే బ్రిటిష్ పాలకుల దోపిడీకి గురియై, కరువు కాటకాలకు లోనైన మన ప్రజలు – ముఖ్యంగా రైతాంగం కాంగ్రెసు పుట్టుకకు ముందు కూడ, అనేకరూపాల్లో ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటనోద్యమ చరిత్రను తెలుసుకొనడం కూడ అవసరమనే ఉద్దేశంతో క్లుప్తంగా వ్రాశాను. ఇందుకు హీరేన్ ముఖర్జీ పుస్తకం సహాయపడింది. తక్కిన చరిత్ర అంతకీ ముఖ్యంగా పామీదత్తు నేటి భారతదేశమే ఆధారం.

—మానికొండ సూర్యారావు.

# 1757 - 1857 సం॥ల మధ్య ప్రజల ప్రతిఘటనోద్యమ చరిత్ర

"మొదట సరుకులకొట్లు; సరుకుల కొట్లల్లా కోట లైనాయి. కోటలు దుర్గాలుగా మారాయి. ఈ దుర్గాల్లో మొదట సరుకులను కాపాడుకొనడానికంటూ చిన్న సిపాయి దళాలేర్పడ్డాయి. ఈ సిపాయిదళాలే పెద్ద సేనలుగా తయా రైనాయి. సేనలతో మహా దండయాత్రలు - దండయాత్రల ద్వారా దేశాలకు దేశాల నాక్రమించుట - యీ రీతిగా క్రమ క్రమంగా ఒక మెట్టునుండి యింకొక మెట్టుకు ప్రాకిపోవడం మహా సులభమైపోయింది. సహజమైపోయింది."

(ఫిలిప్ ఫ్రాన్సిస్ యం. పి. 1787 పార్లమెంటు సభలో ఆంగ్ల రాజ్యస్థాపననుండి.)

1757 లో జరిగిన ప్లాసీ యుద్ధంతో 'ఈస్టిండియా కంపెనీ' పరిపాలన ఇండియా అంతటా వ్యాపించింది. మన దేశం బ్రిటిష్ వర్తకుల అధీనంలోకి పోయింది. ఈస్టిండియా కంపెనీవాళ్ళు మొగలాయి దర్బారులో ప్రవేశించి తాము తెచ్చిన గాజుపూసలను అమ్మకానికి చూపినపుడు అప హాస్యానికి గురి అయ్యారు. ఇండియాలో ఆనాటికే అంత కంటె విలువైన, నాణ్యమైన వస్తువులు తయారవుతున్నాయని గ్రహించారు. పాదుషాల అనుమతితో కలకత్తాలోనూ, సూరత్ లోను గిడ్డంగులు పెట్టుకొన్నారు. మన దేశంలో తయారయ్యే సరుకులనేకొని ఇంగ్లాండు, యూరపు దేశాలకు

ఎగుమతిచేయుటద్వారా తమ వ్యాపారాన్ని సాగించారు; ఇలా వ్యాపారంతో ప్రారంభించి ఫ్యూడల్ ప్రభువుల మధ్యనున్న అనైక్యతను వినియోగించుకొన్నారు. వారి తగాదాల్లో జోక్యం కల్గించుకొని ఒకరికి వ్యతిరేకంగా మరొకరికి తమ సిపాయి దళాలతో సహాయం చేశారు. అందుకు ప్రతిఫలంగా 'దివానీల' పేరుతో రైతులనుండి తామే నేరుగా శిస్తు వసూలు చేసేహక్కును సంపాదించారు. ప్లాసీ యుద్ధంతో యీ క్రమం చాలవరకు పూర్తయింది. సంస్థానాధీశ్వరులు మొదలు రైతులు, వ్యాపారస్తులు, చేతివృత్తుల వాళ్ళవరకు అందరినీ విపరీతంగా దోచుకొనడానికి కంపెనీవాళ్ళకు వీలు చిక్కింది. ఇలా దోచుకొన్న భారతదేశపు బంగారము; సంపద అంతా ఇంగ్లాండు దేశానికి ఎగుమతి చేయబడింది. వాళ్ళ దేశంలో పరిశ్రమల నభివృద్ధి చేసుకొనడానికి పెట్టుబడిగా వుపయోగ పడింది.

ఇలా మనదేశ సంపదను కొల్లగొట్టి పారిశ్రామికంగా తమ దేశాన్నభివృద్ధిచేసుకొన్న బ్రిటిష్ దోపిడీవర్గం అనేక కుట్రలు పన్ని, తమ ఆధునిక మిలిటరీని ఉపయోగించి భారత దేశంపై అంతులేని అధికారాన్ని సంపాదించింది. భారతదేశ చేతి పరిశ్రమల్ని నిర్బంధంగా నాశనం చేసింది. బ్రిటిష్ పారి శ్రామిక వస్తువులు ఇండియాకు దిగుమతికావటం ప్రారంభ మయింది. మొదట్లో ఎగుమతి దేశంగావున్న భారతదేశం బ్రిటిష్ సరుకుల దిగుమతిదేశంగా, వలసదేశంగా తయా రయింది.

ఆనాటికి నూటికి 40,50 గా వున్న చేతివృత్తులవారిని నిరుద్యోగుల్ని చేయడమేగాక, అదివరకున్న స్వయంసంపూర్ణ గ్రామీణ వ్యవస్థను తమ దివానీల పరిపాలనలో ఛిన్నాభిన్నం చేశారు. అంతవరకు అమల్లోవున్న వ్యవసాయ పద్ధతిని, పన్నుల విధానాన్ని రద్దుచేసి దోపిడీని యథేచ్ఛగా కొనసాగించారు. ఒక్క సంవత్సరంలోనే ఒక ఏరియాలో 1764-65 లలో 8 లక్షల పౌనులు పన్నుల రూపంలో వసూలుచేస్తే 1765-66 సంవత్సరాలలో అదే ఏరియాలో 15 లక్షల పౌనులు వసూలు చేశారు. 1793 లో పర్మనెంటు సెటిల్‌మెంటు నాటికి యీ మొత్తం 30 లక్షల పౌనులకు పెరిగింది. ఈవిధంగా ఒక వైపున చేతివృత్తులను నాశనంచేసీ, మరోవైపున అంతకు ముందున్న వ్యవసాయాన్ని నాశనంచేసీ, రైతుల్నీ, చేతివృత్తుల వారినీ దుర్భర దారిద్ర్యానికి గురిచేశారు. ఇలా బలవంతంగా భీకరక్షామానికి గురియైన ప్రజలు ముఖ్యంగా రైతులు తెగించి ఎదురు తిరిగారు. అనేక ప్రదేశాల్లో రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. వాటిలో కొన్నింటిని యీక్రింద ఉదహరిస్తాను. ఈ రైతాంగ తిరుగుబాట్లకు ఆనాటికి సంఘటిత ఉద్యమ నిర్మాణరూపంగాని, రాజకీయ నాయకత్వంగాని లేదు. అందు చేత ఆకస్మిక తిరుగుబాట్లుగానో, ముఠాలుగానో, మతం పేరుతోనో జరిగాయి. ఏరూపంలో జరిగినా, బ్రిటిషువాళ్ళు వాటిని బందిపోటులుగా చిత్రించినా యథార్థాని కవి భూమిపై హక్కులు కోల్పోయి, కంపెనీవాళ్ళ దోపిడీకి గురియైన రైతులు సాగించిన ప్రతిఘటనా పోరాటాలేనని స్పష్టమవుతుంది.

# 1. రైతాంగ తిరుగుబాటులు

"1772 చలికాలంలో 50 వేలమంది బందిపోటుదార్లు బెంగాలు పంటపొలాలమీదికి వచ్చిపడ్డారు" అని అధికారుల రిపోర్టులు. కాని యీ బందిపోటు జరిగిన విధానం చూస్తే ఎంత మొరటుగా కనిపించినప్పటికీ విదేశీ దోపిడీకి వ్యతిరేకంగా సాగించిన బలమైన ఉద్యమమని ఇట్టే ఊహించవచ్చు.

ఈ సంవత్సరంలోనే పెద్ద జిల్లాయైన 'రంగపూర్ జిల్లాలో' ప్రవేశించి కొల్లగొట్టారని అధికార వార్తలు. ఈ దోపిడీలో పాల్గొన్న ప్రతిఒక్కరికీ మరణశిక్ష విధించారు. కుటుంబాలను బానిసలుగా చేశారు. అయినా ప్రతిఘటనను ఆపలేకపోయారు. 1773 లో వీరిని అణచడానికి కాప్టెన్ థామస్ నాయకత్వంక్రింద 4 బెటాలియన్లను పంపారు. ఆ పోరాటం లోనే యితగాడు హతుడయ్యాడు.

1780 లో యీ పై ఉద్యమానికి చెందిన దళాలే కలకత్తాపై దాడిచేశాయి. బ్రిటిష్ దివానీ పరిపాలనకు వ్యతిరేకంగా జరిగిన బెంగాలీ రైతుల పోరాటమే యిది.

1783 లో జెస్సూర్ జిల్లాలో 3 వేలమంది ఖజానా తీసుకుపోతున్న సిపాయిలపై దాడిచేసి దానిని కాజేశారు. ఈ బందిపోటు ముఠానాయకుడే 1500 మంది సహచరులతో (రైతులు) నిలబడి అతనిని అరెస్టుచేయడానికి వచ్చిన సిపాయి దళాన్ని ఎదుర్కొని తరిమివేశాడు.

కారన్‌వాలీస్ పరిపాలనా కాలమంతటిలోనూ బీర్భూమ్ లోనూ, బంకూరాలోను ఈ కల్లోలాలు వ్యాపించిపోయాయి. ఈ ఘటనలన్నీ 'హంటర్' వ్రాసిన 'బెంగాల్ పల్లెపట్టుల

గాథలు' అనే గ్రంథంలో వర్ణించబడ్డాయి. 1787 లో పై దళాలే విష్ణుపూర్ పట్టణాన్ని పట్టుకొని కొన్నిరోజులపాటు పరిపాలించాయి.

1807–13 వరకు గవర్నరు జనరల్‌గానున్న 'లార్డ మింటో' 1810 లో ఈ బందిపోటులను గూర్చి మినిట్సులో యిలా వ్రాశాడు: "ఈ దళాలయొక్క చర్యలు ఎంతో నైపుణ్యంగల్గి ఫ్రెంచి రిపబ్లికనుల విప్లవ చర్యలను మించి పోయాయి. నిజం చెప్పాలంటే బందిపోటు దండులనాయకులు ప్రజల విశ్వాసాన్ని ఎంతగానో చూరగొన్న అధికారులుగా గుర్తించబడ్డారు. ప్రభుత్వంవారు తమ స్వరక్షణార్థమై ప్రజల నుండి ఏమాత్రం సహాయసానుభూతులు పొందలేకపోయారు."

## 2. పిండారీలు

వీరినిగురించి తిరిగి చరిత్ర వ్రాసేటప్పుడు చరిత్రకారులు యిదివరకు వ్రాసినదానికి భిన్నంగా వ్రాయాల్సి వుంటుంది. వీరు ఉత్తరహిందూస్థానంలో గంగా తీరానవుండే రైతులు. వీరి భూములను బ్రిటిషువాళ్ళు ఆక్రమించి జమీందారీవర్గాన్ని సృష్టించారు. భూములు కోల్పోయిన యీ రైతులు ముఠాలుగాచేరి బ్రిటిషు ఏజంట్లను చంపుతూ, వారిని దోచుకుంటూ వచ్చారు. యమునానది మొదలుకొని మదరాసు తీరాన సిలోను వరకు (కోరమాండల్ కోస్టు అంతా) దండయాత్రలు చేశారు. వీరికి ప్రతిచోటా స్థానిక నాయకులు వున్నారు. వీరంతా అసంతృప్తిచెందిన రైతులే. వీరిని అణచుటకై వారన్ హేస్టింగ్స్ కనివిని ఎరుగనంత పెద్దఎత్తున మిలటరీ ప్రయత్నాలు చేయ

వలసి వచ్చింది. మైసూరు టిప్పుసుల్తాను నణచుటకు కారన్ వాలీసు 30 వేలమంది సైనికులను, మహారాష్ట్రులను అణచ డానికి వెలస్లీ 60 వేలమంది సైనికులను ప్రయోగిస్తే ఈ పిండారీ 'బందిపోటులను' అణచడానికి వారన్ హేస్టింగ్సు 1 లక్ష 60 వేల మంది సైనికులను సమీకరించి తలక్రిందులు కావలసి వచ్చింది. మూడురాష్ట్రాలలోనున్న సైనికశక్తినంతనీ సమీకరించుటే గాక, 1818 లో వీరిని అణచిపెట్టడంకోసం రెగ్యులేషన్ III అనే చట్టాన్ని చేశారు.

## 3. థగ్గులు

వీరి ఉద్యమంకూడ భూములు కోల్పోయిన రైతులు సాగించిన ఉద్యమమే. 1939 లో కలకత్తాలో జరిగిన 'చారిత్రిక రికార్డుల కమిషన్' సమావేశ సందర్భంలో ఒక స్కాలరు యీ విషయాన్నిగూర్చి ఒక ముఖ్యమైన పత్రాన్ని చదివాడు. ఆ పత్రంలో 'థగ్గులు భూములు కోల్పోయిన రైతుల'ని ఎంతో బలమైన సాక్ష్యంతో వివరించబడింది. ఈ రైతులు లొంగి యుండే బాపతుగాక, తమ భూములను కాజేసిన దోపిడీవర్గా లకు వ్యతిరేకంగా శక్తివంతమైన ప్రతిఘటన సాగించినవారు. అందుచేతనే అతిభయంకరంగా అణచివేయబడ్డారు.

## 4. సన్యాసి ఉద్యమం

వీరిని వారన్ హేస్టింగ్సు 'హిందూస్థానపు జిప్సీ' లని అన్నాడు. పుష్టి, ధైర్యము అమితోత్సాహము వీరి సొమ్ములట. ఇండియా అంతటిలోను మంచిపుష్టికలిగి అతిముఖ్యమైనవాళ్ళట.

కాబూల్‌నుండి చైనావరకు పర్వతాలకు దక్షిణంగా వుండే ప్రాంతం వీరినివాసస్థానము. వీరుగోచీలుపెట్టుకొని, సన్యాసివేషాలతో ఒకచోటినుండి మరొకచోటికి తిరిగేవారు. మంచి ఆరోగ్యకరమైన బిడ్డల్ని ఎత్తుకుపోయి పెంచి తయారు చేసేవారట. 1763 లో తూర్పుబెంగాలులో ప్రవేశించారు. బకర్‌గంజ్ అనే ప్రాంతాన్ని యీ సన్యాసిదళమొకటి చుట్టుముట్టి ఢక్కాలోని ఇంగ్లీషువాళ్ళ ఫ్యాక్టరీని స్వాధీనం చేసుకొన్నదట. ఈ సన్యాసులను 5 వేల మందిని షుజావుద్దౌలా తనసైన్యంలో చేర్చుకొని 1764 లో బ్రిటిషువాళ్ళకు వ్యతిరేకంగా తానుచేసిన యుద్ధంలో ఉపయోగించాడని అనుకొంటారు. 1774 కు గాని వీరిని బెంగాలునుండి తరిమివేయలేకపోయారు. అటుతర్వాత కూడ వీరిదళాలు చాలాకాలంవరకు అచ్చటచ్చట ఉంటూనే వచ్చాయి. 1776 లో 'మేజర్ రెన్నెల్' అనే అతడు 800 మందితో కూడిన ఒక సన్యాసిదళంతో తీవ్రమైన యుద్ధంచేసి గాయపడ్డాడు. వీరినిగూర్చి చారిత్రిక రికార్డులను పరిశీలిస్తే కేవలం పిల్లల్ని దొంగిలించే వాళ్ళనడం హాస్యాస్పదంగా వుంటుంది. ప్రఖ్యాత బెంగాల్ నవలా రచయిత 'బంకించంద్ర ఛటర్జీ' ఆనందమఠం అనే నవల వ్రాసేటప్పుడు యీ సన్యాసి ఉద్యమం ఆయన్ని ఉత్సాహపరచింది (1883). 'వందేమాతరం' పాట వీరినుండే ఉద్భవించిందని అంటారు.

## 5. వహాబీ ఉద్యమం

ఈ ఉద్యమానికి నాయకుడు 'అబ్దుల్ వహాబీ' అనే అరేబియా దేశస్థుడు. 1787 లో చనిపోయాడు. తర్వాత

ఆయన పేరుతోనే యీ ఉద్యమం సాగింది. మొదట్లో సిక్కు దురాక్రమణకు వ్యతిరేకంగా యీ ఉద్యమం ప్రారంభ మయింది. 1826 తర్వాత పంజాబు మొదలు బెంగాలు అంతా యీ ఉద్యమం బ్రిటిషువాళ్ళకు వ్యతిరేకంగా వ్యాపించింది. ఈ వహాబీలు సాయుధ పోరాటం సాగించి బ్రిటిష్‌వారిని హడలెత్తించారు. బెంగాలు, ఉత్తర హిందూస్థానంల్లో యీ ఉద్యమాన్ని ఆధారంచేసుకొని రైతులు తిరుగుబాట్లు చేశారు. వీరి చరిత్ర హేస్టింగ్సు రికార్డులనిండా కనబడుతుంది. 24 పరగణాలు మొదలైనచోట్ల వీరు భూస్వాములను తొలగించ బూను కొన్నారు. 1831 లో వీరి నాయకుడు బ్రిటిషు సిపాయీలకు వ్యతిరేకంగా రంగంమీద నిలబడి పోరాడుతూ మృతిజెందాడు. సయ్యద్ అహమ్మదు, కర్నల్ ఆలీ, షరీదుల్లా వీరి నాయకులు. షరీదుల్లా చేనేత కార్మికుడు. ఈ విధంగా జనసామాన్యం పాల్గొనడమేగాక, నాయకత్వంకూడ వహించారు. తర్వాత షరీదుల్లా కుమారుడు టిటూమియాన్‌కూడ యీ ఉద్యమంలో పాల్గొన్నాడు. ఈతడు భూమి పంపక కార్యక్రమంకూడ కొనసాగించాడు. ఈ ఉద్యమాన్ని ముస్లిం మత గురువులు వ్యతిరేకించేవారు. వెలివేసేవారు. ముస్లిం ధనికులకు వీరంటే హడలు. (వీరినిగురించి డబ్ల్యు. హంటర్ అనే ఇంగ్లీషు చరిత్ర కారుడు వివరంగా వ్రాశాడు.) ఈ ఉద్యమంలో క్రింది వర్గాలనుండి 80 వేల మంది సభ్యులుగా చేరారు.

1855 లో లక్షమంది సంతాలు రైతులు కొండ ప్రాంతాలనుండి బ్రిటిష్ నిరంకుశ దోపిడీ నిర్బంధాలకు వ్యతిరేకంగా కలకత్తా నగరంలోకి మార్చి చేసుకుంటూవచ్చారు.

ఈ ప్రజా తిరుగుబాట్లన్నీ ఏవో అరాచకవాదులూ, బందిపోటులూ సాగించిన చర్యలంటే సరిపోదు. అవి బ్రిటిష్ ఆధిపత్యాన్ని, అధికారాన్ని గడ గడ లాడించివేశాయి. వాటిని అణచడానికి బ్రిటిషు ప్రభుత్వం భూమ్యాకాశాలు తల కిందులయ్యేట్లు ప్రయత్నించాల్సివచ్చింది. 1828-35 మధ్య గవర్నరు జనరల్‌గానున్న బెంటిక్ 'పర్మనెంటు సెటిల్మెంటు విప్లవోద్యమాన్ని అణచడానికి శక్తివంతమైన ఆయుధంగా ఉద్దేశించబడింది' అని అన్నాడంటే యీ తిరుగుబాట్లను దృష్టిలో పెట్టుకునే.

# 1857 సిపాయి తిరుగుబాటు

ఈ తిరుగుబాటుకు వినాశమైపోతున్న పాత అభివృద్ధి నిరోధక రాచరికశక్తులు, స్థానభ్రష్టులైన సామంతులు నాయకత్వం వహించి నడిపారు. ఆ నాటికి ప్రజల్లోను, రైతుల్లోను, సైనికుల్లోను చెలరేగిన అసంతృప్తిని ఆసరాగా తీసుకొని తమ హక్కులు, సౌకర్యాలకోసం నాయకత్వం వహించి నడిపారు.

(1) 1857 తిరుగుబాటునాటికి రైతుల పరిస్థితి:— రైతుల స్థితిగతులు అంతకుముందుకంటె మరింత తీవ్రరూపం దాల్చాయి. 1764-65 సం॥లలో 8 లక్షల పౌనులున్న పన్ను 1793 పర్మనెంటు సెటిల్మెంటునాటికి 30 లక్షల పౌనులకు ఎలా పెరిగిందో యిదివరకే ఉదహరించాము. ఆతర్వాత 1800-1801 సం॥లో కంపెనీ వసూలుచేసిన మొత్తం పన్ను 42 లక్షల పౌనులైతే 1857-58 లలో 157 లక్షల పౌనులకు ఆమొత్తం పెరిగిందంటే రైతాంగం పన్నులరూపంలో ఎంత

దారుణంగా దోపిడీ చేయబడుతూ వచ్చిందో స్పష్టమవుతుంది. 1850 వరకు 7 సార్లు మాత్రమే క్షామంవస్తే 1850 తర్వాత-సిపాయి తిరుగుబాటుకుముందు, ఆతర్వాతకూడ క్షామాలసంఖ్య, చావుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయిందేకాని తరగటమనేది లేదు. 1850 - 1900 మధ్య 24 క్షామాలువచ్చి 2 కోట్ల మంది జనం చచ్చిపోయారంటే పరిస్థితులతీవ్రత బోధపడుతుంది.

ఇలా పన్నులభారాలతోను, కరువు కాటకాలతోను, వృత్తులుపోయి యమయాతనలుపడుతున్న ప్రజల్లో ఎంత అసంతృప్తి వుంటుందో వేరే చెప్పాలా?

(2) సైనికుల్లో అసంతృప్తి:— కంపెనీ సైన్యంలో 23 వేలమంది బ్రిటిషువాళ్ళు, 1 లక్ష 30 వేలమంది భారతీయులు వుండేవాళ్ళు. 1857 కు పూర్వం జీతాలు ఇవ్వనప్పుడు, ఇతరదేశాలకు సముద్రాంతరాలకు పంపేటపుడు చిన్న చిన్న తిరుగుబాట్లు జరుగుతూ క్రమంగా అసంతృప్తి తీవ్రమవుతూ వచ్చింది.

1763 లో 30 మంది సైనికులు తిరగబడితే కాల్చి వేశారు.

1806 లో దక్షిణభారతంలో వెల్లూరు కంటోన్‌మెంటులో 100 మంది సిపాయీలు తిరగబడ్డారు. వీరందరినీ కాల్చివేశారు.

1824 లో బెంగాలులో 47 వ రెజిమెంటు బర్మాపై యుద్ధం చేయడానికి నిరాకరించి తిరగబడింది.

1844 లో బెంగాలు 7 వ రెజిమెంటు ఎలవెన్సుకోసం తిరగబడింది.

1854 లో చోటానాగపూర్‌లో తిరుగుబాటు జరిగింది.

ప్రజల అసంతృప్తి, వారి పోరాటాలు వీరిలోవున్న అసంతృప్తిని మరింత రగుల్కొల్పాయి. ఏ చిన్న సంఘటన జరిగినా ఈ అసంతృప్తి మహాగ్నిజ్వాలగా రగుల్కొనే పరిస్థితులున్నాయి. కొవ్వుతో తయారుచేసిన తూటాలు అలాంటి చిన్న కారణమే. దానికితోడు ఆనాటికొక క్రొత్త ఆర్డరు వచ్చింది. అంతకుముందు బర్మాపై యుద్ధానికి పోమని సైనికులు తిరగబడ్డారు. ఈ అనుభవాన్ని తీసుకొని రిక్రూట్ చేసుకునే వారందరికీ సముద్రాంతరాలకు, దూరదేశాలకు వెళ్ళాలనే ఒక కొత్త షరతుపెట్టారు.

(3) సైనికుల్లో అసంతృప్తికి ఫ్యూడల్ ప్రభువుల అసంతృప్తి దోహదమిచ్చి వారి తిరుగుబాటుకు నాయకత్వం వహించింది.

దత్తతాధికారాన్ని రద్దుచేయటం ఒక కారణం. ఈ దత్తతస్వీకారార్హత బ్రిటిషువారి చెప్పుచేతల్లోవుండే ప్రభువులకు మాత్రమే యిచ్చారు (నేపాల్). ప్రజా ఉద్యమాలున్నచోట యీ అర్హత యివ్వలేదు (సతారా, ఝాన్సీ). ఇక్కడ ప్రజా ఉద్యమాలకు యీ ప్రభువులు బ్రిటిషువాళ్ళకు వ్యతిరేకంగా సహాయం చేసేవాళ్ళు. ఈ విషయం డల్‌హౌసీ తన కంపెనీకి యిచ్చిన స్టేట్‌మెంటులో వున్నది.

'షా అలం' చక్రవర్తికి బ్రిటిషువాళ్ళు తన మనోవర్తిని ఎగగొట్టారనే అసంతృప్తి వుంది.

తాంతియాతోపేకు పీష్వా పదవి పోయింది. దానితో అతడు కలిశాడు.

ముస్లిం ప్రభువులలో కూడ పూర్తి అసంతృప్తి వుంది. ముస్లిం ప్రజల్లోకి కూడ మతరూపంలో వ్యాపించింది. ముస్లిం ప్రభువులకు అదివరకు తమకు ఇండియా మొత్తంపై వున్న సార్వభౌమాధిపత్యాన్ని తొలగించి బ్రిటిషువాళ్ళు కాజేసినందుకు, కోర్టులలో అదివరకున్న పర్షియన్ భాషస్థానంలో ఇంగ్లీషు అమలుజరిపినందుకు, అలాగే అదివరకు ముస్లింలకున్న ఉన్నతోద్యోగాలన్నీ ఊడిపోయినందుకు వీరిలో అసంతృప్తి పెరిగింది. దీనికితోడు 1851-52 ప్రాంతాలలో ముస్లిం మతగురువులకు కూడ అధికారాలు తగ్గించారు. ఈ కారణాలన్నీ ముస్లింలలో ఉద్రేకాన్ని పెంచాయి.

(4) చపాతీ ఉద్యమం:—ఉత్తర హిందూస్థానంలో ఒక సాంప్రదాయం వుండేది. ఏదైన ఒక పెద్ద ఘటన జరగబోతోంది అనేదానికి చిహ్నంగా ఒకడు చుట్టుప్రక్కల నాలుగుదిక్కులలోనున్న గ్రామాలకు చపాతీలు పంచుతారు. ఈ తీసుకున్నవారు తిరిగి ఇదేవిధంగా చేస్తారు. 1857 లో ఇదేవిధంగా చపాతీ ఉద్యమం ప్రారంభమయింది. బెంగాలులో ముందు ముస్లిం మతగురువులు ఒక పల్లె మసీదులో సమావేశమై యీ చపాతీ ఉద్యమాన్ని గురించి చెబుతూ తెల్లవారిని పడగొట్టేదశ ప్రారంభమయిందనీ, అల్లా దీవిస్తాడనీ - యీ రూపంగా పిలుపు యిచ్చారు.

1857 మొదలు బారక్‌పూరులో సిపాయి తిరుగుబాటు ప్రారంభమయింది. మే 10 వ తేదీన మీరట్ ముస్లింపటాలం దీని నందుకొన్నది. ఈ పటాలాలు ఢిల్లీకి 'మార్చిచేసి' 'షాఅలంను' చక్రవర్తిగా ప్రకటించాయి.

ఫ్యూడల్ ప్రభువుల నాయకత్వాన (ముఖ్యంగా మరాఠీ నాయకుడు తాంతియాతోపే, ఝాన్సీరాణి) 1858 ఆఖరు వరకు యీ తిరుగుబాట్లు జరిగాయి. తరువాత ఓడిపోయింది. వీరు తిరుగుబాటు చేయునపుడు ఫ్యూడల్ పద్ధతుల్లోనే గ్రామాలను కొల్లగొట్టే పద్ధతు లవలంబించారు. అందువల్ల ప్రజలు మొదటి 6 నెలల్లో చేసిన సహాయ సానుభూతులు ఆ తర్వాత లేవు. ఈ నాయకుల ఆశయం యీ తిరుగుబాటు అనంతరం తిరిగి ఫ్యూడల్ ప్రభువుల పరిపాలనను నెలకొల్పవలెనని మాత్రమే.

(5) ఈ తిరుగుబాటులో గుర్తించవలసిన విషయాలు :—

దేశం మొత్తంమీద జరిగిన బ్రహ్మాండమైన సాయుధ తిరుగుబాటు యిది. ఈ తిరుగుబాటులో అన్నివర్గాలవాళ్ళు పాల్గొన్నారు. ఇదే సమయంలో భూసాములకు వ్యతిరేకంగా బెనారసులో పన్నుల వ్యతిరేకఉద్యమం జరిగింది. భూమి పంపకం జరిగింది. ఆ రోజుల్లో ప్రజలమధ్య మతకలహాలుగాని, యితర తగాదాలుగానిలేవు. ప్రభువులమధ్య మాత్రమే ఆ తగాదాలు.

# 1857 అనంతరం ప్రజాపోరాటాలు

1857 తిరుగుబాటులో ఓడించబడింది ఫ్యూడల్ ప్రభువులు మాత్రమే. ప్రజా ప్రతిఘటనగాని, ప్రజావుద్యమంగాని ఓడించబడ లేదు.

1. నీలిరైతుల తిరుగుబాటులు (1859-61) :- 1859-61 మధ్య తూర్పుబెంగాలురాష్ట్రమంతా అట్టుడికినట్లుడికిపోతూంది. నీలిపంటలు పండించే రైతుల పోరాటాలతో ఉద్రూతలూగి

పోయింది. 1830 నాటికే నీలిపంటదొరలు (యూరోపియన్‌లు) రైతులకుచేసిన ఘోరాలు ప్రపంచానికి వెల్లడైనాయి. రైతులనుండి రావలసిన బాకీలపేరుతో ఘోరనిర్బంధాలు, హత్యాకాండ సాగించారు. ప్రభుత్వమద్దతుతో వాళ్ళఘోరాలు తర్వాతకూడ కొనసాగుతూనే వచ్చాయి. ఈ యూరోపియన్ ప్లాంటర్లకు తాము జమీందార్లవద్దనుండి భూములను కవుళ్ళకు తీసుకొని రోజుకూలీలనుపెట్టి పనిచేయించడం ద్వారా సంపాదించే లాభాలతో తృప్తిలేకపోయింది. 1850 ప్రాంతాలలో తామే జమీందార్లుగా తయారై తమ జమీలక్రింద నున్న పొలాలలో, రైతులచే నీలిపంటలు నిర్బంధంగా వేయించడం మొదలుపెట్టారు. కంట్రాక్టులు బిగించుకొన్నారు. ఆ కంట్రాక్టు షరతుల్లో ఏమున్నదో పాపం రైతులకు తెలియదు. జమీందారుగాను, ప్లాంటరుదొరగాను – రెండువిధముల నిరంకుశత్వం రైతుపై వినుచుకపడింది. వరిపంటకుబదులు నీలిపంటవేస్తే రైతుకు విపరీతమైననష్టం. అయినా కంట్రాక్టు ననుసరించి వేయకతప్పదు. పైగా యీ పంట వేసేందుకు ఖర్చులకుగాను యీ దొరలవద్దే అప్పు తీసుకోవాలి. అప్పుగా ఒకసారి తీసుకొనడమంటే ఆ రైతు, రైతుకుటుంబము యీ నీలి ప్లాంటరుదొరకు శాశ్వతంగా బానిసలు కావల్సిందే. సంవత్సరం పొడుగునా కష్టపడి పండించిన యీ నీలిపంటను ఆ దొరకే, అదివరకు నిర్ణయించుకొన్నధరకే అమ్మాలి. అది ఖర్చులుగిట్టనిధర. ఇక అప్పు ఎలా తీరుస్తాడు? ఇక ఆ రైతులగోడు అంతా యింతా కాదు. దనికితోడు యీ రైతులపై చలాయించడానికి 1860 లో శాసనసభద్వారాకూడ యీ 'ప్లాంటరుదొరలు' హక్కు సంపా

దించుకు వచ్చారు. ఈ రైతుల బాధలను వర్ణిస్తూ కాస్త అభి వృద్ధికరంగా ఆలోచించే రచయిత ఒకరు 'నీల్‌దర్పణ్' అనే నాటకాన్ని వ్రాయుటకూడ జరిగింది. ఈ బాధలనుంచి నీలి రైతుల ఉద్యమం బ్రహ్మాండంగా బయలుదేరింది. 'నీల్‌దర్పన్' నాటకాన్ని ఇంగ్లీషులోకి అనువదించిన 'జేమ్సులాంగ్' అను నతడు యిలా వ్రాశాడు: "నేను ఔద్ నవాబు అనుచరులు వేసిన ఒక కరపత్రాన్ని చదివాను. ఆ కరపత్రంలో ఔద్ నవాబు ప్రజలపై దురంతాలు సాగిస్తున్నాడనికదా అతని అధి కారాన్ని బ్రిటిషువారు ఊడబెరికారు. అంతకంటె పెద్దఎత్తున నీలిమందు రైతులపై ఘోరదురంతాలు సాగిస్తున్న ఇంగ్లీషు వారిని, వారి ప్రభుత్వాన్ని బెంగాల్‌నుండి ఎందుకు ఊడగొట్ట గూడదు? అని వ్రాయబడింది. 1856 లోనే యీ తిరుగుబాట్లు వస్తాయని అంచనావేశారు. కాని రగిలిరగిలి 1859 నాటికి యీ ఉద్యమం సమ్మెలరూపం దాల్చింది. 1860 లో యీ సమ్మెల ద్వారా ఏర్పడిన క్లిష్టపరిస్థితినిగూర్చి 'కానింగుప్రభువు' తన రికార్డులో యిలా వ్రాసుకొన్నాడు: "ఈ! ప్లాంటర్లు తమ దౌష్ట్యంకొద్దీ ఎక్కడ తొందరబడి ఒకగుండు ఉపయోగించినా ఒక్కసారిగా పాపం భళ్ళున బద్దలై మన ప్రభుత్వమే తుడిచి పెట్టుకుపోయే ప్రమాద మేర్పడింది" అని వ్రాసుకున్నాడు. ఈ ఉద్యమాన్ని విపరీతమైన మిలిటరీశక్తితో, తీవ్రనిర్బంధాలతో అణచివేయగల్గారు.

2. తిరిగి వహాబీఉద్యమం :— నీలి ఉద్యమం తర్వాత తిరిగి వహాబీ ఉద్యమం చెలరేగింది. వీటిని అణచడానికి రెండు యుద్ధాలు చేయాల్సివచ్చింది. ఉద్యమం మొత్తంమీద అణగి

పోయినా మిగిలిపోయిన విప్లవకారులు చాలకాలం వరకు అచ్చటచ్చట తిరుగబడుతూనే వుండేవారు. 1864 లో వీరిని అణచివేయుటకు 11 మంది నాయకులమీద 'అంబాలా కుట్రకేసు' పెట్టబడింది. వీరిలో ఒకరు మహమ్మదీయ మతగురువు, ఒకరు రైతు, ఒకరు సైనికుడు, మరొకరు కసాయి వృత్తి చేసుకునే వారు. ఇలాగే వున్నారు.వీరు తమ విచారణ సందర్భంలో తాము ప్రభుత్వాన్ని కూలద్రోయటానికే ప్రయత్నించామని ధీమాగా చెప్పుకొన్నారు. వీరికి యావజ్జీవ శిక్ష వేయడం జరిగింది.

3. 1872-73 లలో 'విద్రోహిలీగ్' అనే రైతు సంఘాలు బెంగాలులో తనాదియా జిల్లాలోను, తూర్పు బెంగాలులోను ఏర్పడి ఉద్యమం లేవదీశాయి. దక్షిణ భారత దేశానికి కూడ యీ ఉద్యమ ప్రభావం ప్రాకింది.

4. దక్కన్ తిరుగుబాట్లు :— ఇవి 1875 లో ఎక్కువగా జరిగాయి. కరువు కాటకాలకు గురిఅయిన దక్కన్ రైతులు శిస్తులు ఎగవేసి దోపిడీలకు పూనుకొన్నారు. ఈ ఉద్యమాన్నిగురించి విచారించుటకే 1875 లో 'దక్కన్ రైతు కమీషన్'ను ప్రభుత్వం నియమించింది. 1879 లో యీ కమిషన్ రిపోర్టు నాధారంగా తీసుకొని దక్కన్ రైతుల రిలీఫ్ యాక్టును ప్యాసుచేశారు. దీని ప్రకారం కొంతవరకు శిస్తులు తగ్గించబడ్డాయి. శిస్తు యివ్వకపోతే వెంటనే అరెస్టు చేసే పద్ధతిమాని కోర్టుద్వారా వసూలు చేసే మార్పు వచ్చింది.

5. 1875 ప్రాంతాలలో సంతాలు రైతులు మరొక పర్యాయం తిరుగుబాటు చేశారు.

6. 1895 - 1900 సంవత్సరాలలో 'సంతాలు' నివసించే ప్రాంతాలలోని ఆదివాసులు 'కలండు' అనే అతని నాయకత్వంక్రింద తిరుగుబాటు చేశారు. ముఖ్యంగా వీరు అడవులమీద, సాగుభూములమీద తమకే హక్కుండాలనీ, శిస్తులు యివ్వనవసరంలేదనే నినాదాలమీద ఉద్యమం నడిపారు.

7. 1899 లో దక్షిణ భారతదేశంలోకూడ 'కాండ్రా' ప్రాంతంలో రైతుల తిరుగుబాట్లు జరిగాయి. ఈ ప్రాంతంలో బ్రాహ్మణులు వర్తకంద్వారా, విపరీత వడ్డీ వ్యాపారంద్వారా ప్రజలను దోచుకొంటూ వుండేవారు. ఈ అప్పులు చెల్లించలేని రైతులు వీరికి వ్యతిరేకంగా ఉద్యమం లేవదీశారు. బర్‌హాంపూర్ జిల్లాలో యీ ఉద్యమం జరిగింది. ఈ ఉద్యమం పర్లాకిమిడి ప్రాంతంలోని ఉదయగిరికికూడ ప్రాకింది. 1910 వరకు యీ ఉద్యమం సాగింది. వీరు గెరిల్లా పోరాటాల్లాంటివి చేశారు. వీరిని అణచుటకు సైనికులు ఉపయోగింపబడ్డారు. నేటికికూడ యీ ఉద్యమాన్ని అణచే సందర్భంలో ప్రత్యేకంగా కట్టిన వంతెనలున్నాయట. ఈ వంతెనలపైనే యీ ఉద్యమాన్నణచుటకు నిర్మించబడినట్లు లిఖించబడిందట.

# 1857 అనంతరం
# బ్రిటిష్‌పాలనా స్వభావంలో మార్పు

సిపాయి తిరుగుబాటు అనంతరం 1858 లో విక్టోరియా రాణి ఒక ప్రకటన చేసింది. అంతకుముందే బ్రిటనులో పారిశ్రామిక విప్లవంద్వారా వర్తక పెట్టుబడిపై పారిశ్రామిక

పెట్టుబడి ఆధిక్యత సంపాదించింది. దాని ప్రభావం ఇండియా మీదకూడ పడింది. సిపాయి తిరుగుబాటువరకు ఈస్టిండియా కంపెనీయొక్క, బ్రిటిషు ప్రభుత్వంయొక్క ద్వంద్వాధికారం సాగింది. విక్టోరియారాణిప్రకటనతో ద్వంద్వాధికారం అంతమై బ్రిటిషు ప్రభుత్వంయొక్క పరిపూర్ణాధికారం ఇండియాలో ఏర్పడ్డది.

రాణి ప్రకటనలో యిలా అన్నది: "మా ప్రజలు ఏజాతికి, మతానికి చెందినవారైనప్పటికి కార్యనిర్వహణకు తగిన విద్య, సమర్థత, నిజాయితీ ఉన్నట్లయితే ఏ పదవిలోకి గాని తీసుకోవచ్చు. అందులో పక్షపాతం చూపము. ఇదే మా సంకల్పం."

భారతీయులకూ, బ్రిటిషువారికీ ఏమీ తేడా చూపబడదు అని యీ ప్రకటనద్వారా నటిస్తూ, పరిపాలనా పద్ధతిలో ప్రధానమైన మార్పులు తీసుకువచ్చారు.

ప్రజలకు వ్యతిరేకంగా భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులను తమవైపున నిలబెట్టుకొనేందుకు అవలంబించిన వైఖరే యీ ప్రధానమైన మార్పు. కొంతమంది ఫ్యూడల్ ప్రభువుల సహకారంతోనే మిగతావారి నాయకత్వంక్రింద నడిచిన తిరుగుబాటును అణచివేయగల్గామని గ్రహించారు. ఈ అనుభవంతో యీ ఫ్యూడల్ ప్రభువులయెడ తమ విధానం మార్చుకొన్నారు. ఆ వర్గాలను తమకు అండగా నిలబెట్టుకో వలసిన అవసరాన్ని గుర్తించారు. దత్తత స్వీకారాన్ని అంగీకరించారు. అభివృద్ధి నిరోధక వర్గాలతోబాటు వారి మతగురువులనుకూడ తమ వెనుక వేసుకొన్నారు.

వీరవలంబించనున్న యీ ఎత్తుగడలను గూర్చి 1853 లోనే మార్క్సు యిలా స్పష్టంచేశాడు: "భారతదేశంలోని అభివృద్ధినిరోధక సంస్థానాలను తమ కీలక కేంద్రాలుగా ఉపయోగించుకొని భారతదేశంలో తిష్ఠవేస్తారు."

సైన్యంలోకూడ భారతీయులను కీలక స్థానాలనుంచి తొలగించారు. బ్రిటిష్ సైనికుల నిష్పత్తిని ఇంకా ఎక్కువచేసి సైన్యాన్ని పునర్నిర్మించారు.

ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులు మొదలైనవారిని సమీకరించ బూనుకొన్నారు. మొదట్లో ముస్లింలే బ్రిటిషు వ్యతిరేకతను ఎక్కువ ప్రదర్శించారు. అందుచేత తిరుగుబాటు అనంతరం హిందువులలో ముస్లిం వ్యతిరేకతను బ్రిటిషు ప్రభుత్వం ఉద్దేశపూర్వకంగా రెచ్చగొట్టడం ప్రారంభించింది. ఈ తిరుగుబాటు అనంతరమే మన చరిత్రలో ముస్లిం వ్యతిరేకతను రెచ్చగొట్టే గ్రంథాలను ఎక్కువగా చూస్తాం. హిందూ సాంప్రదాయాలను, చరిత్రను విపరీతంగాపొగడుతూ, యీ నాగరికతనంతనూ ముస్లింలు నశింపజేశారని అనేక గ్రంథాలు రచింపజేశారు. ముస్లింలు చేసిన మంచిపనులను గూర్చి రచించిన గ్రంథాలు జాతీయోద్యమం అభివృద్ధి అయిన తర్వాతనే, 1932 నుండి మాత్రమే కనబడతాయి.

## కాంగ్రెసు పుట్టుక - వెనుకనున్న చరిత్ర

భారత జాతీయ ఉద్యమానికి ప్రధాన సంస్థగావుంటూ వచ్చిన కాంగ్రెసు 1885 లో స్థాపించబడింది. 'హ్యూమ్' అనే ఇంగ్లీషువాని చొరవతోను, పర్యవేక్షణతోను, ఆనాటి

వైస్రాయి డఫరిన్ యొక్క ఆమోద ముద్రలతోను ప్రారంభమైనమాట నిజమే. దీనిని సాకుగా తీసుకొని బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు భారత జాతీయతకు తామే మూలమైనట్లు, యీ సంస్థను స్థాపించుటకు తమ ఉదారబుద్ధే కారణమన్నట్లు గొప్పలు చెప్పుకొనేవారు.

కాని అసలు వాస్తవ మేమిటి? ఆనాటికి పరిస్థితులు పరిపక్వమైన తర్వాతనే తప్పనిసరియై ఆ సంస్థ ఏర్పడింది. ఆనాటివరకూ ప్రజల్లో విజృంభిస్తూ వచ్చిన అసంతృప్తి ఎలా పోరాటరూపాలు ధరించిందో యిదివరకే చూచాము. దీనికి తోడు అసంతృప్తి చెందిన ప్రజలకు నాయకత్వం వహించేటటువంటి ఒక నూతనవర్గం; ఒక క్రొత్తశక్తి – భారత బూర్జువావర్గం – ముందుకొచ్చింది. 1853 లో మొదటిసారిగా ఒక చిన్న పత్తి మిల్లు బొంబాయిలో స్థాపించబడింది. మొదట్లో భారతీయ వర్తకులకు పరిశ్రమలు పెట్టుకొనుటకు కొంత అవకాశం దొరికింది. 1880 నాటికి భారతీయుల పెట్టుబడితో, 44 వేల కార్మికులతో 156 మిల్లులవరకు ఏర్పడ్డాయి. బ్రిటిషువాళ్ళ ప్రోత్సాహంతోనే ప్రారంభంలో యివి ఏర్పడినప్పటికి, క్రమంగా బ్రిటిష్‌భారత పెట్టుబడిదారీవర్గాలమధ్య వైరుధ్యంబయలుదేరింది. ఆనాటికే పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతూవచ్చిన జర్మనీ అమెరికాల పోటీని బ్రిటన్ ఎదుర్కొనవలసివచ్చింది. భారత దేశంలో బ్రిటిష్ పెట్టుబడిదారీవర్గం తన ప్రత్యేక సౌకర్యాలను ఏర్పాటుచేసుకొని కాపాడుకొనుటకు పూనుకొన్నది. 1877 లో బ్రిటిష్ వస్తువులపై దిగుమతి సుంకాలు రద్దు చేసేచట్టం, యింకా యితర ప్రత్యేక సౌకర్యాలు మొదలైనవన్నీ భారతీయ

వర్తకులను నేరుగా దెబ్బకొట్టాయి. దీనితో బూర్జువా వర్గంలో అసంతృప్తి పెరిగింది. అదే సమయంలో 1877లో దేశమంతటా బ్రహ్మాండమైన కరువు వ్యాపించింది. ఒకవైపున ప్రజలు కరువుతో చస్తూంటే, మరోవైపున 'విక్టోరియారాణీ'ని భారతదేశ చక్రవర్తినిగా ప్రకటించిన సందర్భంలో ఢిల్లీలో దర్బారు దర్జాలకు అంతులేని ఖర్చును దుబారాచేశారు. వీటన్నింటిపై ప్రజల్లో వచ్చిన అసంతృప్తినంతటినీ కూడగట్టి బూర్జువావర్గం తల ఎత్తుతున్న సంగతిని సామ్రాజ్యవాదులు గ్రహించారు. ఈ పోరాటశక్తులకు కళ్ళాలువేసి తమ అదుపాజ్ఞల్లో పెట్టుకొనడానికే బ్రిటిష్ ప్రభుత్వము, దాని ఏజెంట్లు నాటకం ప్రారంభించారు. దాని పర్యవసానమే 'హ్యూమ్, డఫరిన్' దొరలు 1885 లో కాంగ్రెసు స్థాపనలో తమవంతు పాత్రను ప్రదర్శించడానికి కారణమయింది.

ఇక్కడ ఒక ముఖ్యవిషయాన్ని గమనించాలి. 1853లోనే 'మార్క్సు' ఒకవిషయం స్పష్టంచేశాడు. బ్రిటిష్ పరిపాలన 1853 నాటికే రెండు ప్రాథమిక కర్తవ్యాలను నెరవేర్చిందన్నాడు. ఒకటి, భారతదేశంలో అంతకుముందు అమల్లోవున్న స్వయంసంపూర్ణ గ్రామీణవ్యవస్థను నిర్మూలించడం. రెండవది, తన దోపిడీకి అనుకూలము, అవసరము అయినంతవరకు మాత్రమే పరిశ్రమాభివృద్ధిని జరగనివ్వడం. 19 వ శతాబ్దపు ప్రారంభంలోనే భారతదేశంలోని ప్రాచీన ఆర్థిక వ్యవస్థను నిర్మూలించి ఆధునిక అభివృద్ధికి మార్గం సరిచేసింది. ఆధునిక వ్యవస్థకు అవసరమైన రైల్వేలు, టెలిగ్రాఫ్ మొదలైన అవసరాలను ప్రవేశపెట్టి ప్రపంచ మార్కెట్టుతో

భారతదేశానికి సంబంధాల నేర్పరచింది. అయితే నూతన సమాజస్థాపన అంతమాత్రంతో జరిగిపోదు. అందుకవసరమైన నూతన శక్తులకు నిర్మాణరూప మివ్వాలి. ఆ నూతన శక్తులు సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని నిర్మూలించే పోరాటానికి నాయకత్వం వహించాలి. ఈ అవసరాన్ని ప్రజలు గుర్తించుతున్నారని తెలుసుకోగానే, సామ్రాజ్యవాదం యీ శక్తుల నెదురొడ్డి నిలుస్తుంది. దానిని ప్రతిఘటించి జాతీయ ఉద్యమం పెంపొందాల్సివుంటుంది. ఇలాంటి జాతీయ ఉద్యమానికి ప్రారంభ సూచనలు భారతదేశంలో 1828 నాటికి ఏర్పడ్డాయి. క్రమంగా 1885 నాటికి కాంగ్రెసు పుట్టుకతో జాతీయ ఉద్యమానికి ఒక రూపమేర్పడింది.

## 1828 లో బ్రహ్మసమాజ స్థాపన

రాజా రామమోహనరాయ్ ఈ బ్రహ్మసమాజానికి మూల పురుషుడు. పురోగామి ఉద్యమాలలో బ్రహ్మసమాజం ఒకటి. రాజా రామమోహనరాయ్ హిందూమతంలోని లోపాలను ఖండించాడు. సహగమనాన్ని వ్యతిరేకించాడు. బ్రహ్మసమాజం ఇంగ్లీషు చదువుకొన్న మధ్య తరగతివారిని ఆకర్షించింది. యూరప్ ఉద్యమాలను ఆదర్శంగా తీసుకొని మతాన్ని సంస్కరించ బూనుకొన్నది. రాజా రామమోహన్ మొదటి ఇంగ్లీషు పేపరును కలకత్తాలో 1780 లో ప్రారంభించాడు. కుల, మత, ఛాందసాభిప్రాయాలకు వ్యతిరేకంగా జాతీయ దృష్టితో పనిచేశాడు. ఈయన కృషి ఫలితంగా 1835 లో కలకత్తా ప్రెసిడెన్సీ కాలేజి స్థాపించబడింది.

పాశ్చాత్య నాగరికతను అలవరచుకోవాలనీ, అప్పుడే ప్రపంచ పరిస్థితిని తెలుసుకోగలమనీ భావించి ప్రచారం చేశాడు. జమీందార్ల దౌర్జన్యానికి వ్యతిరేకంగా ఒక మెమొరాండం తయారు చేసి ఇంగ్లాండు బయలుదేరాడు. అదే సందర్భంలో, ఫ్రెంచి విప్లవ ప్రభావం, అప్పుడప్పుడే తల ఎత్తుతున్న బూర్జువా మేధావులపై ఎలా పనిచేసిందో తెలుసుకోవాలంటే రామ మోహన్‌రాయ్ ఉదంతమే ఉదాహరణగా తీసుకోవచ్చు. ఆయన ఇంగ్లాండు వెళ్ళేటపుడు ఎంత ఆలస్యమైనా, ఒడిదుడుకు లొచ్చినా ఫ్రెంచి నౌకమీదనే ప్రయాణంచేయ నిశ్చయించుకొన్నాడు.

ఇదే విధంగా ఆంధ్రదేశంలో కాంగ్రెసు పుట్టుకకు ముందే వీరేశలింగంగారు సంఘ సంస్కరణకు నడుంకట్టి పని చేశారు.

# మరికొన్ని సంస్థలు - వాటి పాత్ర

బ్రిటిష్ ఇండియా సొసైటీ :— 1843 లో బెంగాలులో యీ సంస్థ స్థాపించబడింది. అన్నివర్గాల ప్రజలకు న్యాయము, సౌభాగ్యము కల్గేలా కృషిచేయడమే ఈ సమితియొక్క ఆశయమని స్పష్టం చేయబడింది.

1851 లో యీ సమితి, దానితోబాటు 'బెంగాలు భూస్వాముల సమితి' కూడ 'బ్రిటిష్ ఇండియన్ ఎసోసియేషన్' అనే సంస్థలో మిళితమైపోయాయి. ఆ మరుసంవత్సరం యీ ఎసోసియేషన్ తరఫున బ్రిటిష్ ప్రభుత్వానికి ఒక వినతి పత్రాన్ని సమర్పిస్తూ ఇలా తెలియజేశారు: "మేమాశించి

నంతగా బ్రిటిష్ ప్రభుత్వంనుండి మేలుజరగలేదని భావిస్తున్నాం. ప్రభుత్వ రెవిన్యూపద్ధతి సరిగాలేదు. పరిశ్రమల అభివృద్ధిని నిరుత్సాహపరచి అరికడుతున్నది. లెజిస్లేటివ్ కౌన్సిలుకు ప్రజా స్వామిక పద్ధతులద్వారా ఎన్నికలు జరపడంలేదు. విద్యా విధానం సంతృప్తికరంగాలేదు. ప్రభుత్వం యీ అన్ని విషయాల లోను మార్పు తీసుకురావాలి" అని సూచించారు.

తొలిరోజుల్లోనియీసంస్థలు భూస్వాములతోకూడ దగ్గర సంబంధం కలిగివుండేవి. అందుచేతనే 'బ్రిటిష్ ఇండియన్ ఎసోసియేషన్'లో భూస్వాముల సంస్థకూడ కలిసిపోయింది.

ఇదేకాలంలో పశ్చిమాన బొంబాయిలో 'బొంబాయి ఎసోసియేషన్' స్థాపించబడింది. దీని స్థాపకులు వి. యన్. మాండలిక్, దాదాభాయినౌరోజీ మొదలైనవారు.

బ్రిటిష్ ఇండియన్ ఎసోసియేషన్లో జమీందారీ భూస్వాములుకూడా ఉండేవారని పైన చెప్పాము. 1875లో పెద్దభూస్వాముల పెత్తనానికి వ్యతిరేకంగా 'ఇండియన్ ఎసోసియేషన్' అనేపేర 'సురేంద్రనాథబెనర్జి' మరొక సంస్థను స్థాపించాడు. ఈ రెండు సంస్థలకు భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో శాఖ లేర్పడ్డాయి.

1875 ప్రాంతాల్లోనే పూనాలో 'రనడే' నాయకత్వాన సార్వజనికసభ ఒకటి ఏర్పడింది. మద్రాసులో 'నేటివ్ ఎసోసియేషన్' పేరుతో మరొకసంస్థ ఏర్పడింది.

ఈ సంస్థలన్నింటి ఆధ్వర్యాన ప్రచారంకోసం 478 పత్రికలు నడపబడ్డాయి. హిందూపేట్రియట్, ఇండియన్‌మిర్రర్, అమృతబజారు పత్రిక, బెంగాలీ సులభ సమాచార్ (దమ్మిడీ

ఖరీదు), హిందూ, స్వదేశమిత్రన్, బొంబాయిసమాచార్ మొదలైన పత్రికలన్నీ ఆరోజుల్లో ఏర్పడ్డవే.

ఈ వివిధ ఎసోసియేషన్లద్వారాను, ఈపత్రికలద్వారాను జరిగిన ప్రచారం ఆనాటి బూర్జువా మేధావివర్గాల అభిప్రాయాల ప్రతిబింబమని చెప్పవచ్చు. బ్రిటిష్ ప్రభుత్వం తమ పాలనా సౌలభ్యంకోసమై ఇంగ్లీషు చదువులు ప్రవేశపెట్టక తప్పలేదు. ఒకవైపున యంత్రాల ప్రవేశంద్వారా వచ్చిన భౌతిక పరిణామాలు, దానికితోడు పాశ్చాత్యవిద్య యీ మేధావుల్లో సంచలనాన్ని కలిగించాయి. ఈ విద్యాధికులు బ్రిటిష్ పార్లమెంటులో ఆనాటి అభివృద్ధిశక్తులకూ, అభివృద్ధి నిరోధక శక్తులకూ జరిగే వాగ్యుద్ధాలతో ముగ్ధులవుతూ, ఆకర్షించబడేవారు. పాలకవర్గ ఉద్యోగులైన పిట్సు, వెల్లింగ్టన్, హేస్టింగ్సులకు వ్యతిరేకంగా పోరాడుతున్న మిల్లన్లు, షెల్లీలు, బైరన్లు వీరికి ఆదర్శప్రాయులు. తమకు యీదేశంలో బ్రిటిష్‌వారితో జరుగుతున్న సంఘర్షణకు, బ్రిటనులో జరుగుతున్న సంఘర్షణకు పోల్చి చూచుకునేవారు.

1877–78 సం॥లలో ఇండియా ఎసోసియేషన్ తరఫున సురేంద్రనాథ్‌బెనర్జీ దేశం నలుమూలలా సంచారంచేసి ఉపన్యాసాలిచ్చాడు. సివిల్ సర్వీస్ పరీక్షలు ఇంగ్లాండులోగాక ఇండియాలోనే పెట్టాలనీ, వయఃపరిమాణాన్ని నిర్ణయించాలనీ ప్రచారం చేశాడు.

ఈ రోజుల్లోనే 'ఇల్బర్టు బిల్లును' ప్యాస్‌చేయాలని తీవ్ర ఆందోళన సాగింది. ఈబిల్లు ఇండియాలోనున్న యూరోపియనులనుకూడ భారతీయ జడ్జీలే విచారించవలెనని ప్రవేశ

పెట్టబడింది. బిల్లును యూరోపియనులు తీవ్రంగా ప్రతిఘటించారు. అయినా తీవ్రఆందోళనద్వారా యీ బిల్లు ప్యాసయింది.

1833 లో కలకత్తాలో 'ఇండియన్ ఎసోసియేషన్' చొరవతో 'ప్రథమ అఖిలభారత జాతీయ మహాసభను' సమావేశపరచింది. బెంగాలు, మద్రాసు, బొంబాయి, సంయుక్త పరగణాలనుండి ప్రతినిధులు వచ్చారు. ఈ సభకు 'ఆనందమోహన్ బోసు' అధ్యక్షత వహించాడు (1896 లో ఈయన కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడు). ఈయన ఉపన్యసిస్తూ "ఈసభ జాతీయ శాసనసభకు నాంది" అని అన్నాడు.

1834లో మరల మద్రాసులో దేశం నలుమూలలనుండి వచ్చిన ప్రతినిధులతో సమావేశం జరిగింది.

ఈ చరిత్రక్రమాన్నంతనీ పరిశీలిస్తే జాతీయభావం కానీ, జాతీయ కాంగ్రెసు నిర్మాణంయొక్క ఆలోచనకానీ అప్పటికే భారత మేధావుల చొరవతో, కార్యాచరణతో ఏర్పడిందని స్పష్టమవుతుంది. అందుచేత కాంగ్రెసు పుట్టుక వెనుక జాతీయభావాలకు మూలకారణమైన పరిస్థితులు, చరిత్ర వున్నాయని సులభంగా అర్థంచేసుకోవచ్చు.

అయితే బ్రిటిషు ప్రభుత్వం యీ పరిణామాన్నంతనీ జాగ్రతగా పరిశీలిస్తోంది. మధ్యలో కల్పించుకొన్నది. ఎటూ ఏర్పడుతూన్న ఉద్యమాన్ని తన చేతుల్లోకి తీసుకోవాలని ముందుకువచ్చింది. దాని ఫలితమే 'హ్యూమ్, డఫరెన్' దొరగార్ల నాటకమంతా.



# కాంగ్రెసు ప్రథమ సమావేశం

'హ్యూమ్' దొర ఆనాటి వైస్రాయి 'డఫరిన్'ను కలుసుకొని ప్రతి సంవత్సరమూ సామాజిక వ్యవహారాలు చర్చించడానికి అనుమతిని కోరుతూ, తన పథకాన్ని వైస్రాయి ముందుంచాడు. అతనికంటె అందెవేసినచేయి వైస్రాయి. "అబ్బే; అంతేగాదు. పరిపాలనా వ్యవహారాలు కూడ చర్చించండి. పార్లమెంటరీ ప్రతిపక్షమంటూ ఇండియాలో లేనపుడు యీసంస్థ ఆపనిచేయడానికి ఉపయోగపడుతుంది" అని సలహా యిచ్చాడు. ప్రభుత్వ దృష్టిలో జాతీయ కాంగ్రెసు స్థాపన ద్వారా, రానున్న జాతీయ విప్లవోద్యమాన్ని అరికట్టడానికే యీ సహకారమంతానని గ్రహించవచ్చు. వైస్రాయి యొక్క సలహాను తీసుకొని ఆయన ఉదారస్వభావాన్ని పొగడుతూ 'హ్యూమ్' దొర బాధ్యతనంతా భుజానవేసుకొని దేశం నలుమూలలా ప్రచారంకోసం బయలుదేరాడు. కాంగ్రెసు సమావేశ ప్రయత్నాలను అందరెసీ సమీకరించాడు.

ప్రథమ కాంగ్రెసు సమావేశం 1885 డిసెంబరు 28, 29, 30 తేదీలలో బొంబాయిలో జరిగింది. డబ్లియు. సి. బెనర్జీ అధ్యక్షత వహించాడు. అసలు బొంబాయి గవర్నరైన 'రీ'నే అధ్యక్షుడుగాచేదామంటే, అది మంచిదికాదని 'డఫరిన్' సలహా యిచ్చాడు.

అధ్యక్షుడు తన ఉపన్యాసంలో యిలా అన్నాడు: "బ్రిటిష్ ప్రభుత్వానికి మన భక్తి విశ్వాసాలు చూపుతాము. పరిపాలనకు లోబడి పనిచేస్తాము" అని సమావేశానంతరం

హ్యూమ్ దొరగారికి జయ జయ ధ్వానాలుచేస్తే దానికతడు కృతజ్ఞత తెల్పుతూ, ఆ అభివందనాలు తనకు గాకుండా మహా ఘనత వహించినటువంటి, తల్లి సమానురాలు, యజమాను రాలు అయినటువంటి విక్టోరియారాణీకి అర్పించమని కోరగా ప్రతినిధులంతా ఆమెకు విపరీతంగా జేజేలు కొట్టారు.

జాతీయోద్యమ ప్రారంభదశయొక్క చరిత్ర నంతటినీ పరిశీలిస్తే మనకు కొన్ని ముఖ్య విషయాలు బోధపడతాయి.

జాతీయోద్యమ పురోగమనానికి తహ తహ లాడు తున్న అభ్యుదయవాదులనుండి 'రాజభక్తిపరులను' వేరుచేసి, కాంగ్రెసుద్వారా ప్రభుత్వానికి బలం చేకూర్చాలని లార్డ్ డఫరిన్, హ్యూమ్ దొరల ఆశయం. కాని యీ ఆశయం నెరవేర లేదని అనతికాలంలోనే చరిత్ర నిరూపించింది.

పైన చెప్పినట్లు దాస్యభావంతో ప్రభుత్వంపట్ల భక్తి శ్రద్ధలు కలిగివుంటామని చెప్పే ప్రారంభదశనుండి అటు తర్వాత నిషేధించబడి, ప్రభుత్వంచే వేటాడబడుతూ భారత స్వాతంత్ర్యసంగ్రామానికి నాయకత్వం వహించే స్థితికి కాంగ్రెసు వచ్చింది.

కాంగ్రెసు పుట్టుకలోనున్న యీ ద్విముఖ స్వభావం, తర్వాత దాని చరిత్రకంతటికి చాల ముఖ్యమైనది. చరిత్ర పొడవునా యీ స్వభావం అంతర్గతమైవుంది. ఒకముఖం ప్రజా ఉద్యమ ప్రభావానికి బెదరి, సామ్రాజ్యవాదంతో రాజీపడ్డానికి ఎప్పటి కప్పుడు సిద్ధపడటం. మరొకవైపున జాతీయ పోరాటా నికి నాయకత్వం వహించి నడపడం. గోఖలేనుండి ఆయన శిష్యు

వైన గాంధీగారివరకు యిది వర్తిస్తుంది. ఈ వైరుధ్యం భారత పెట్టుబడిదారీవర్గంయొక్క రెండురకాల పాత్రకు ప్రతిబింబనే.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యీ వైరుధ్యం తీవ్ర తరమయింది. చివరకు ప్రజా ఉద్యమాల ఉధృతాన్ని చూచి బెదరిన కాంగ్రెసు నాయకత్వం ప్రజల్ని, సంపూర్ణ స్వాతంత్ర్య ఆశయాన్ని వదలి సామ్రాజ్యవాదులతో రాజీపడింది. బ్రిటిష్ పరిపాలన పరోక్షంగా సాగేస్థితిలోనే దేశాన్నుంచివేసింది.

## జాతీయ పోరాటంలో మూడు దశలు

భారత జాతీయ ఉద్యమంయొక్క చారిత్రికాభివృద్ధిని పరిశీలిస్తే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యేవరకు ఆ పోరాటవెల్లువలను మూడు దశలుగా చిత్రించవచ్చు. ఒక దశలో జరిగినదానికంటె తరువాత దశలో ఉద్యమం మరింత ఉన్నతస్థాయిలో జరిగింది. ప్రతిదశా మరొక క్రొత్తదశకు మార్గాన్ని సుగమం చేసింది.

ఈ ఉద్యమం ప్రారంభదశలో పెద్ద ధనికవర్గాలకు, భూస్వాముల్లో అభ్యుదయకర శక్తులకు, క్రొత్తగా పైకివస్తున్న పారిశ్రామిక ధనికవర్గానికి, ధనిక మేధావివర్గానికి ప్రతిబింబంగా పనిచేసింది. 1914 కు ముందు పట్టణ మధ్యతరగతి ప్రజల్లోని అసంతృప్తిని యీఉద్యమం ప్రతిబింబించింది. కాని యిది ప్రజా సామాన్యంలోకి చొచ్చుకుపోయి వారిని ఉద్యమంలోకి ఆకర్షించ లేకపోయింది. మొదటి ప్రపంచయుద్ధం తర్వాతనే ప్రజలపాత్ర, రైతు - పారిశ్రామిక కార్మికవర్గాలకు చెందిన నూతన శక్తుల

పాత్ర ముందుకు వచ్చింది. ప్రజల ప్రత్యక్ష పాత్ర యుద్ధం ముగిసిన తర్వాత సంవత్సరాలలో మొదటిసారిగాను, రెండో సారి ఆర్థికసంక్షోభం తర్వాత సంవత్సరాల్లోను వచ్చిన రెండు ఉద్యమాల్లోను ప్రస్ఫుటమయింది.

మొదటి పోరాటవెల్లువ 1905-1910 సం॥ల మధ్య జరిగింది. 1919-'22 సం॥ల మధ్య రెండవ పోరాటవెల్లువ విజృంభించింది. ఆర్థికసంక్షోభాన్ని వెన్నంటి 1930-'33 సంవత్సరాల్లో మూడవ పోరాటవెల్లువ అంతకంటె ఉన్నతస్థాయికి చేరుకొన్నది.

మొదటి పోరాటవెల్లువ ప్రారంభమయ్యేదానికి ముందు, కాంగ్రెసు స్థాపన. అనంతరం జరిగిన చరిత్రగతిని కొంత పరిశీలించి తదుపరి ఆపోరాటక్రమం ఎలాజరిగిందో చూదాము.

1885 నుండి 1905 వరకు కాంగ్రెసుస్థాపన అనంతరం రెండు దశాబ్దాలపాటు కాంగ్రెసు దాని స్థాపకులు నిర్ణయించిన మార్గంలోనే ముందుకు సాగింది. కనీసం స్వయం పరిపాలన కావాలనన్నా కాంగ్రెసు తీర్మానాలలో మచ్చుకు కనబడవు. కేవలం బ్రిటిష్ పాలనా సంస్థల్లో భారతీయుల ప్రాతినిధ్యాన్ని కొంత ఎక్కువచేయాలని మాత్రమే వీరి కోరిక. మొదటి 25 సంవత్సరాలలోను 5 గురు యూరోపియనులే కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారంటే వీరిదృష్టి ఎలా వుండేదో తెల్లమవుతుంది.

1885, '86, '87 లలో బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాల్లోజరిగిన మూడు మహాసభల్లోను విద్యాధిక

వర్గాలను దృష్టిలో పెట్టుకొనిమాత్రమే తీర్మానాలు చేయ బడ్డాయి.

1888 - '96 సం॥ ల మధ్య యీ దృక్పథమే భారత దేశంలోను, ఇంగ్లాండులోనుకూడ ప్రచారం జరగడం చూస్తాము. ఈ కాలంలో రాష్ట్ర, జిల్లా సంఘాలు దేశ మంతటా ఏర్పడి అఖిలభారత కాంగ్రెసు కమిటీ రూపొందింది. 1897 మొదలు 1908 వరకు ప్రజల్లోను, బ్రిటిష్ ప్రభుత్వం మీద భ్రమలు పెట్టుకు కూర్చున్న వర్గాలలోను ఆశలు అడి యాశలై తీవ్ర అసంతృప్తి చెలరేగింది. అదే సమయంలో అసంతృప్తిజ్వాలల నణచివేయడానికి ప్రభుత్వ దమననీతి తీవ్రతర మయింది. వీటన్నింటిప్రభావం కాంగ్రెసుమీద ప్రతిబింబించడం చూస్తాము.

కాంగ్రెసు యీదశ అంతటిలోను ధనికవర్గానికి ప్రతినిధి గాను, ముఖ్యంగా ఆవర్గ ఆశయాలకు ప్రతినిధులైన మధ్య తరగతి విద్యావంతులకు ప్రతినిధిగాను పనిచేసింది. ఈ సంగతి కాంగ్రెసు తీర్మానాలు చూచినా, ఆమితవాదనాయకుల ఉపన్యా సాలు చూచినా, కాంగ్రెసు నిర్మాణ నిబంధనావళిని చూచినా స్పష్టమవుతుంది. కాంగ్రెసు మహాసభకు ప్రతినిధుల సంఖ్య మరీ పరిమితం చేయబడింది. ఆ ప్రాతినిధ్యం మధ్యతరగతుల్లోనే నిలచిపోయింది. తాము ప్రజలందరినీ ప్రతిబింబించడం లేదని ఆనాటి కాంగ్రెసు నాయకులకు కూడ స్పష్టంగా తెలుసు. 1899 లో కాంగ్రెసు మహాసభకు అధ్యక్షుడైన ఫిరోజిషా మెహతా తన ఉపన్యాసంలో యీ విషయాన్నిలా స్పష్టం చేశాడు: "నిజమే; కాంగ్రెసు ప్రజా ప్రతినిధికాదు. కాని

ఆ ప్రజల కోరికలను, కష్టాలను వ్యాఖ్యానించడమూ, వాటి నివారణకు సలహాల నివ్వడమూ విద్యావంతుల విధి."

ఈ విద్యాధికులు ప్రజల కష్టాల్ని తీర్చే ఉద్యమాలను ప్రజలపాత్ర లేకుండా, తమంతతాముగా కడకంట నడప గల్గు తారా? లేదు. వారు బ్రిటిష్ పరిపాలనను సవాలుచేయలేరు. బ్రిటిష్‌వాళ్ళను పొగడుతూ, బ్రిటిష్‌ప్రజాస్వామిక సూత్రాలను చూచి పులకితు లయ్యేవారు. బ్రిటిష్ పాలకవర్గం తమకో సహకరిస్తుందని ఆశించేవారు. వారికి ప్రధాన శత్రువు బ్రిటిష్ పాలకవర్గం కాదు. 1898 లో అధ్యక్షుడైన ఆనందమోహన్ బోస్ ఇలా అన్నాడు: "విద్యాధికులు ఇంగ్లాండుకు మిత్రులే కాని, శత్రువులుకారు. ఇంగ్లాండు తన మహత్కార్యాన్ని సాధించడంలో యీమిత్రత్వం అవసరంకూడ." ఇలాగే అంతకు ముందు దాదాభాయి నౌరోజీ రెండవ కాంగ్రెసుకు అధ్యక్షత వహిస్తూ "ఈ విద్యావంతులను ప్రతిపక్షంలోకి త్రోయకండి; మీవైపుకు తీసుకోండి" అని విజ్ఞప్తిచేశాడు.

ఇలాంటి ప్రకటనలు ఆనాటి ముఖ్యనాయకుల ఉపన్యాసాలలో అనేకం కనబడతాయి. ఈ ప్రకటనల ధోరణినిబట్టి యీ పురాతన కాంగ్రెసు నాయకులందరినీ పచ్చి అభివృద్ధి నిరోధకులుగా పరిగణిస్తామా? లేదు. ఆనాటి పరిస్థితుల్లో వారు కొంత అభివృద్ధికరపాత్ర వహించారు. ఆనాటికింకా కార్మిక కర్షక విప్లవ శక్తులు అభివృద్ధికాలేదు. ఆ పరిస్థితుల్లో వారు సంఘసంస్కారానికి, విజ్ఞాన వికాసాలకు, ఆధునిక భావాలకు అనుగుణ్యంగా పనిచేశారు. పారిశ్రామిక, వైజ్ఞానిక

అభివృద్ధిని అభిలషించారు. కాని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల సహకారంతోనే సాధిద్దామని ఆశపడ్డారు.

అయితే సామ్రాజ్యవాదులపై వారు పెట్టుకొన్న ఆశలు, విశ్వాసాలు కూలిపోవటకు ఎంతో కాలం పట్టలేదు. వీరి అభ్యుదయకర భావాలు తమకు ముప్పు దెస్తాయని బ్రిటిష్ పాలక వర్గం గ్రహించింది. మొదట ప్రోత్సహించిన వైస్రాయి 'డఫరిన్' అచిరకాలంలోనే కాంగ్రెసును గురించి అది ఎవరికీ ప్రాతినిధ్యం వహించని సంస్థయని ఏవగింపుగా మాట్లాడటం మొదలుపెట్టాడు. 1890 నాటికి ప్రభుత్వోద్యోగులెవ్వరూ కాంగ్రెసుకు ప్రేక్షకులుగాకూడ వెళ్ళకూడదని ప్రభుత్వం తాఖీదులను పంపింది. అల్లాబాద్ జిల్లాలో కాంగ్రెసు సమావేశమగుటకు స్థలం లేకుండా ప్రభుత్వం నిషేధిస్తే, దర్భాంగా మహారాజు తన కోట ఆవరణలో సమావేశమగుటకు ఏర్పాట్లు చేసి గట్టెక్కించాడు. 1900 సం॥ లో లార్డ్ కర్జన్ ఇండియా మంత్రికి యిలా వ్రాశాడు: "కాంగ్రెసు పతనం చెందుతోంది. దానిని శాంతంగా సమాధి చేయడంలో తోడ్పడడమే నా సంకల్పం".

ఈ విధంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాంగ్రెసును తమ అనుపాజ్ఞల్లో వుంచుకొనే సంస్థగా చేయలేమని ఎప్పుడైతే గ్రహించారో, యిక అప్పుడు దాన్ని పతనం చేయడానికి అన్ని ప్రయత్నాలు చేస్తూవచ్చారు. అందుచేతనే మితవాదులకు తొలినుంచీ నాయకుడైన గోఖలేసైతం తన చివరి రోజుల్లో చాల కటువుగా బ్రిటిష్ పాలకవర్గాన్ని యిలా ఆక్షేపించాడు: "బ్రిటిష్ నిరంకుశోద్యోగవర్గం బాహాటంగా స్వార్థం చూపెడు

తోంది. జాతీయవాంఛలను వారు బహిరంగంగా వ్యతిరేకిస్తు న్నారు. పూర్వం యిలాగ లేదు" అని వెలిబుచ్చాడు.

## మొదటిదశలో కాంగ్రెసులో అతివాదము

పాతవిధానం విఫలమయిందని స్పష్టమయింది. సహజంగానే క్రొత్త విధానం కావాలనే వర్గం బయలుదేరింది. ఈ వర్గం సామ్రాజ్యవాదంతో బంధనాలను త్రెంచుకోవాలనీ, ఒక నిశ్చితమైన కార్యక్రమం కావాలనీ ముందుకు వచ్చింది. ఈ వర్గానికి 19 వ శతాబ్దం చివరిలో బాలగంగాధరతిలక్ నాయకత్వం వహించాడు. కాని తర్వాత 10 ఏండ్లవరకు పరిస్థితి పరిపక్వమైన తర్వాతనే, వీరు ప్రముఖపాత్ర నిర్వహించగల్గారు. మహారాష్ట్రలో తిలక్‌తోబాటు బెంగాలులో అరవిందఘోష్, బిపిన్‌చంద్రపాల్, పంజాబులో లాలా లజపతిరాయి మొదలైనవారు అతివాదులకు నాయకత్వం వహించారు.

అతివాదులను ఆనాడు జరిగిన అనేక ముఖ్యమైన ఘటనలు కార్యరంగంలోకి తెచ్చాయి.

వాటిని యీక్రింద ఉదహరిస్తున్నా :

1. ఇండియన్ మింట్ యాక్టు :— 1893 లో ప్రభుత్వం ప్రవేశపెట్టింది. దీనివల్ల లోగడ అమల్లోనున్న నాణెముల పద్ధతి పోయింది. అదివరలో ఒక తులం వెండినే ముద్రవేసి ఒక రూపాయిగా చలామణీ చేసే పద్ధతి అమల్లో వుండేది. ఈ యాక్టు ద్వారా యీ పద్ధతిపోయి ప్రభుత్వం ముద్రించిన రూపాయి మాత్రమే చలామణీ అయే పద్ధతి ప్రవేశపెట్టారు. ఈ రూపాయిలో వెండి 1/5 వంతు మాత్రమే. దీనిని భారత పెట్టుబడి

దారులు తీవ్రంగా వ్యతిరేకించారు. కాంగ్రెసు 1893-94 సమావేశాలలో వ్యతిరేకిస్తూ తీర్మానించింది. ఈ సమయంలో తమ నష్టాన్ని పూడ్చుకొనడానికి మిల్లు యజమానులు కార్మికుల పనిగంటలు పెంచాలనే కోర్కెను లేవదీశారు. కాని కార్మికులు పనిగంటల పెంపకాన్ని వ్యతిరేకిస్తూ, ఒకవైపున సమ్మెచేస్తూనే, మరోవైపున యీ మింటుయాక్టును వ్యతిరేకిస్తూ నిలబడ్డారు.

2. ఈ విధంగా పెల్లుబికిన ఉద్యమాన్ని అణచడానికి 1897 లో అదివరకున్న రెగ్యులేషన్‌ల నన్నింటినీ కలిపి ఒక నిర్బంధచట్టాన్ని తీసుకువచ్చారు. దీని ననుసరించి ఎట్టి నేరారోపణ చేయకుండానే అరెస్టుచేసి దీర్ఘకాలం ప్రవాసశిక్ష విధించవచ్చును. దీనికి వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ఆందోళన చెలరేగింది.

3. వీటికితోడు ఆరోజుల్లో కరువు, ప్లేగు, భూకంపం, మిడతలు, నిర్బంధం మొదలైన 7 రకాల యీతిబాధలు పైనబడ్డాయి. టీకాలపేరుతో ఉద్యోగులు ప్రజల్ని వేటాడారు. ప్రజలు ఉద్రేకులై నడిబజారులో ఇద్దరు ఆఫీసర్లను హత్యచేశారు. దీనికి ప్రతిగా ప్రభుత్వం 4 గురు కాంగ్రెసునాయకులను నడిబజారులో వురిదీసింది. ప్రజలు ఉద్రిక్తులయ్యారు. ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. ఈ ఉద్యమాన్ని ఆనాటి పత్రికలన్నీ బలపరిచాయి.

4. ఈ రోజుల్లోనే అస్సాం టీతోటల్లో కార్మికులు బాధలుపడలేక కొంతమంది తెల్లయజమానులను చంపటం జరిగింది. ఆపైన వీరిపై తీవ్ర నిర్బంధం ప్రయోగించబడింది.

పై జెప్పిన ఈ ఘటన లన్నిటికీ కాంగ్రెసులో పుట్టిన అతి వాదవర్గం నాయకత్వం వహించింది.

## హిందూ పునరుజ్జీవన ఉద్యమం

అతివాదులకు నాయకత్వం వహించిన తిలక్ వర్గం రాజకీయంగా అతివాద మవలంబిస్తూ, సాంఘికంగా పూర్తి అభివృద్ధి నిరోధక నైఖరిని అవలంబించింది. అందుచేతనే వీరి నాయకత్వాన జరిగిన పోరాటా లన్నిటిలోను మతావేశం కనబడుతుంది. 'హిందూమతాన్ని పునరుద్ధరించాలి' అనే ప్రేరేపణతో ప్రజలకు ఆవేశం కల్పించి ఉద్యమాలు నడిపారు.

ఈ హిందూ పునరుజ్జీవన ఉద్యమం అసలు 1864 లోనే ప్రారంభమయింది. మూలపురుషులు స్వామి దయానందసరస్వతి, గణపతి, శివాజీలను ఆదర్శమూర్తులుగా తీసుకొని వారి దినోత్సవాల రూపంలో ఈ ఉద్యమం ప్రారంభమయింది. శివాజీలాగ పరాయివాళ్ళను వెళ్ళగొట్టాలనే ఆవేశం యీ ఉత్సవాల్లో కనబడేది.

బాలగంగాధరతిలక్ 1893 లో యీ పై ఉత్సవాలలో పాల్గొని వాటికి రాజకీయరూపం యిచ్చుటకు పూనుకొన్నాడు. తీర్మానాలద్వారానే ప్రభుత్వాన్ని పడగొట్టలేమనీ, తీవ్రమైన పద్ధతులద్వారానే పడగొట్టాలనీ యీ ఉత్సవ సమయాల్లో ఉపన్యాసాలుండేవి. కాని పైన చెప్పినట్లు యీయన సాంఘిక పద్ధతులుమాత్రం అభివృద్ధి నిరోధకాలు. ప్రభుత్వం ఆర్యమత సమాజ పద్ధతులమీద పరిపాలన నడపాలని యీయన ఉద్దేశం.

ఈ కారణంచేతనే ఆనాడు మహారాష్ట్రంలో జరుగుతున్న రైతు తిరుగుబాట్లజోలికి పోలేదు. ఆ ఉద్యమాన్ని నడుపుటకు పూనుకోలేదు. అలాగే కార్మికుల్లోవున్న అసంతృప్తికికూడ ఉద్యమరూపం ఇవ్వలేదు. అందువల్లనే ఉద్యమం ముందుకు పోలేదు.

ఇదే రోజుల్లో రష్యాలో లెనిన్ యిలాంటి అసంతృప్తి పరిస్థితుల్లోనున్న కార్మికులను, రైతులను కూడగట్టాడు. ప్రపంచ విప్లవ అనుభవాలను తమ దేశానికి అనువర్తింపజేసి ఉద్యమాన్ని ముందుకు నడిపాడు.

కాని తిలక్ మహాశయునకు యీ విప్లవ దృక్పథం లేదు. సాంఘికంగా సంకుచిత విధానాలలో మునిగిపోయాడు. సాంఘిక ప్రతిరోధక శక్తుల పునాదిమీద, సనాతన హిందూ ధర్మంమీద ఆధారపడి, ఆధునిక పాశ్చాత్య నాగరికతకన్నా హిందూ ఆర్య నాగరికతలు ఆధ్యాత్మికంగా ఉన్నతమైనవని వాదించాడు. దానిమీద ఆధారపడి జాతీయ ఉద్యమాన్ని నిర్మించ బూనుకొన్నాడు. చివరకు వివాహమాడే కన్య వయస్సు 10 నుండి 12 సంవత్సరాలకు పెంచాలనే బిల్లును సైతం తీవ్రంగా ఎదిర్చి దీనిపై పెద్ద ఆందోళన లేవదీశాడు.

ఇదేరోజుల్లో బెంగాలులో 'కాళీ వుపాసకుల' ఉద్యమం ముందుకువచ్చింది. విదేశీయుల్ని కాళికి బలి యివ్వాలనే ఉద్యమంగా రూపొందించడానికి ప్రయత్నాలు జరిగాయి. రానురాను యీ ఉద్యమం సంకుచితమైపోయి, విదేశాలనుండి నేర్చుకోవాల్సిన మంచినికూడ విసర్జించాలనే మూర్ఖత్వానికి తయారయింది.

# రామక్రిష్ణ మిషన్ ఉద్యమం

రామక్రిష్ణ పరమహంస మతసామరస్య సిద్ధాంతాన్ని సూత్రీకరించాడు. ఈయన శిష్యుడు వివేకానందుడు పరమ హంస సిద్ధాంతాలకు మెరుగుపెట్టాడు. రాజకీయ ఉద్యమాలతో సంబంధం పెట్టుకోనకపోయినా, మన సంస్కృతి బాగుపడాలంటే మనకు స్వాతంత్ర ముండాలని స్పష్టంగా వెలిబుచ్చాడు. మానవ సేవయొక్క ఉత్కృష్టతను ఉగ్గడించాడు. స్త్రీలకు స్వాతంత్ర ముండాలన్నాడు. పిరికితనాన్ని నిరసించాడు. 1893 లో విదే శాల్లో సంచారం చేస్తూ భారతీయ సంస్కృతినిగూర్చి ప్రచారం చేసాడు. 1902 లో 31 వ ఏటనే చనిపోయాడు. ఆయన వేదాంతం అద్వైత వేదాంతం. కాల పరిస్థితులతో బాటు సామాజిక పరిస్థితులు మారాలన్నాడు.

వివేకానందుడు ఆరోజుల్లోవుండే మత మాధ్యాలకు మూలమైన 'కాళీ వుపాసకుల' లోనున్న యువకులను తనవైపు ఆకర్షించి పాశ్చాత్య పద్ధతుల్లోని మంచినికూడ తీసుకోవాలని బోధించాడు.

'కాళీ వుపాసకుల' ఉద్యమం ముస్లింలను వ్యతిరేకించేది కాదు. పాశ్చాత్యుల్ని మాత్రమే వ్యతిరేకించేది. ఈ ఉద్యమం వ్యాపించిన ప్రాంతాలలో ముస్లింలు సురక్షితంగానే వుండేవారు. అయినా యీ ఉద్యమంలో హిందూమత ప్రాబల్యం పనిచేయడం వల్ల ముస్లింల నెంతమాత్రం ఆకర్షించలేక పోయింది.

ఈ కాలంలో 'సయ్యద్ మహమ్మద్' నాయకత్వాన ముస్లింలీగు ఏర్పడి, ముస్లిం మధ్యతరగతుల్లో పనిచేసింది.

దీనికికూండా ప్రారంభంలో కాంగ్రెసుకు వలెనే ప్రభుత్వ ప్రోత్సాహమున్నది. ముస్లింలపై హిందువులను రెచ్చగొడుతూ వచ్చిన ప్రభుత్వం, క్రమంగా ముస్లింలకు కాంగ్రెసుపై ద్వేషం కలిగించ నారంభించింది. 1897 నుండి ముస్లిమ్ లీగ్ పాతివలె ప్రవర్తించసాగింది. కాని చదువుకొన్న ముస్లింలు కొద్దిమంది కాంగ్రెసులో చేరుతూండేవారు.

## అతివాదులు - మితవాదులు - పరస్పర వైరుధ్యాలు

మితవాదులైన గోఖలేవర్గంవారిని తీవ్రవాదులైన తిలక్ వర్గంవారు వ్యతిరేకించారు. మితవాదులు సామ్రాజ్యవాదంతో రాజీపడుతున్నారనీ, స్పష్టమైన పోరాటమార్గం చూపించడం లేదనీ తీవ్రవాదులు వ్యతిరేకించారు. అంతవరకు అతివాదులు అభ్యుదయకరపాత్రే వహించారని చెప్పవచ్చు. కాని యీ నినాదాలతో యీ అతివాదులు అట్టడుగున వున్న ప్రజాసామాన్యం లోకి చొచ్చుకుపోయారా అంటే లేదు. అసంతృప్తి చెంది యున్న మధ్యతరగతుల్లోకి, తక్కువ జీతాలతో అవస్థపడుతున్న మేధావంతుల్లోకి మాత్రమే వీరి నినాదాలు చొచ్చుకు పోయాయి. వీరిని, 'స్వరాజ్యం నా జన్మహక్కు' అని తిలక్ యిచ్చిన సింహనాదం ఉత్తేజపరచింది. కాని సహజంగా ఊగిసలాడే స్వభావం కల్గిన యీ వర్గాలు తమ వాంఛలను సాధించుకునేవరకు ఉద్యమాన్ని కడకంట సాగించుకోలేక పోయాయి. ఆనాటి కింకా సాంఘిక విప్లవానికి నాయకత్వం

వహించగల కార్మికవర్గం అభివృద్ధి చెందలేదు. దానికి సంబంధించిన సిద్ధాంత పునాదులు మన దేశంలో అసలే ఏర్పడలేదు. అందుచేత రైతుల, కార్మికుల ఉద్యమాలను నిర్మించి అభివృద్ధి పరచే దృక్పథం వారికి లేదు. ఇలాంటి దృక్పథం లేనందువల్లనే ఆనాటి అతివాదులు మితవాద నాయకుల రాజీధోరణికి కారణం 'విజాతీయ భావాలు, పాశ్చాత్య దృక్పథాలు' మాత్రమేనని వూహించారు. అందువల్లనే ఏ విషయంలో పాత మితవాద నాయకులు అభ్యుదయగాములుగా వున్నారో, ఆ అభ్యుదయ భావాలపైనా, కార్యాచరణపైనా తమ దాడిని ... పెట్టారు. మితవాదులు సనాతన మతాచారాలను వ్యతిరేకిస్తే, అతివాదులు సనాతనాచారాల్లోని మూఢత్వాన్నంతనీ బలపరిచారు. ఆవిధంగా అతివాదుల్లో రాజకీయ అతివాదమూ, సాంఘిక అభివృద్ధి నిరోధకభావమూ మేళవింపబడ్డాయి. జాతీయ ఉద్యమ భవిష్యత్తును యీ సమ్మేళనం పాడుచేసింది. అతివాదులు అభివృద్ధి నిరోధక సనాతన వర్ణవ్యవస్థను ఆదర్శంగా తీసుకొన్నారు. హిందూ సభ్యత ఉన్నతమైన దంటూ దానినింకా అభివృద్ధిచేసి విస్తృతపరచాలనుకొన్నారు. అందుచేత యీ తీవ్రవాదులు ఆధునిక సామాజిక శాస్త్రీయ అభివృద్ధినంతనీ దురాక్రమణదారుల నాగరికత కాబట్టి, విచక్షణ లేకుండా వ్యతిరేకించాల్సిందే నన్నారు. దేశభక్తి, ధైర్య స్థైర్యాలు కల్గిన యీ తీవ్రవాద నాయకులు ప్రజలను పాతకాలపు మూఢాచారాలనుండి వదలించి విమోచన మార్గంలో, విజ్ఞాన వికాసాల మార్గంలో నడిపించడానికి బదులు, కుల మత ప్రత్యేక మర్యాదలను, మూఢాచారాలను

బలపరచారు. ఈ విధంగా యీ సనాతన జాతీయవాదులు తాము సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయ ఉద్యమాన్ని నిర్మిస్తున్నట్లు గాఢంగా విశ్వసించారు. తిలక్ మహాశయునివంటి మేధశ్శాలి అతి బాల్య వివాహాలను సమర్థిస్తూ ఆందోళన చేశాడన్నా, గోసంరక్షణ సంఘాన్ని లేవదీశాడన్నా యీ విధంగానే వివరించగల్గుతాము. వీరవలంబించిన యీ విధానంద్వారా రాజకీయచైతన్యము, ఉద్యమ పురోగమనము దుర్బలపడింది. అతివాదుల్లోని ప్రఖ్యాతనాయకు లనేకమంది అంతోయింతో రకరకాలుగా సామ్రాజ్యవాదంతో సహకరించే స్థితికి వెళ్ళారు; లేదా రాజకీయాలనుండి విరమించి వేదాంతంలో (అరవిందఘోష్) మునిగిపోయారు. వీరవలంబించిన యీ విధానం మూలాన అదివరలో సామ్రాజ్యవాదులఎడ గల భ్రమలు పోయి తీవ్రవాదంవైపు మొగ్గుతున్న అనేకమంది వీరితో కలవ లేకపోయారు. ఆ విధంగా సామ్రాజ్య వ్యతిరేక శక్తులు ఏకబాటలో పురోగమించలేక పోయాయి.

## 1905-ఆ తర్వాత మొదటి పోరాటవెల్లువ

1905 లో నూతనదశకు పరిస్థితులు పరిపక్వమైనాయి. పాతకాలపు మతవేదాంత ఊహాగానాలమీద ఆధారపడిన ఉద్యమ పద్ధతులు వెనకబడ్డాయి. మనదేశంలో వస్తున్న మార్పులకుతోడు 1905 నాటి ప్రపంచ పరిస్థితులుకూడ భారత జాతీయ శక్తుల్ని కదలించాయి. జారుప్రభుత్వాన్ని ఓడించడం ఏ ఆసియాదేశానికి సాధ్యంకాదు అని అంతవరకూ వున్న అభి

ప్రాయం జపానుదేశం జయించడంతో మారిపోయింది. మరో వైపున ప్రథమ రష్యన్ విప్లవ ప్రాథమిక విజయాలు కనబడ్డాయి.

ఇదే సమయంలో భారతదేశంలో పోరాటాన్ని ముందుకు తెచ్చిన తక్షణ సమస్య బెంగాలు విభజన. రాజకీయ అభివృద్ధికి కేంద్రంగానున్న బెంగాలును విభజించాలని లార్డు కర్జన్ ఒక ప్రణాళిక తయారుచేశాడు. అతని తర్వాత వచ్చిన వైస్రాయి దాని నమలు జరుప బూనుకొన్నాడు. ఈ చర్య దేశమంతటా ఆవేశాన్ని రెచ్చగొట్టింది. ఈ విభజనకు వ్యతిరేకంగా 1905 ఆగస్టు 7 వ తేదీన విదేశ వస్తువులను బహిష్కరించాలని ప్రకటించబడింది. ఆ విధంగా యిదివరకు అవలంబించే పోరాట పద్ధతికి భిన్నంగా ఆధునిక ఆర్థిక లక్షణాలు కల్గిన ఒక ప్రధాన ఆయుధం – ఆర్థిక బహిష్కరణ పద్ధతి ముందుకు వచ్చింది. ఈ ఆయుధానికి మితవాద నాయకుల బలంకూడ దొరికింది.

1905 కాంగ్రెసు మహాసభ అప్పటికికూడ కొన్ని షరతులతోనే బహిష్కరణోద్యమాన్ని బలపరిచింది. కాని 1906 లో జరిగిన కలకత్తా కాన్ఫరెన్సు అతివాదుల పలుకుబడి బలంతో పూర్తిగా కొత్త కార్యక్రమాన్ని ఆమోదించింది. కాంగ్రెసు పాతనాయకుడు దాదాభాయి నౌరోజీ యీ కార్యక్రమాన్ని తయారుచేశాడు. ఈ కార్యక్రమం అంతవరకు అతివాదుల నినాదంగా మాత్రమే వుంటూ వచ్చింది. 'స్వరాజ్యం' అనే ఆశయాన్ని కాంగ్రెసు ప్రప్రథమంగా ప్రకటించింది. ఈ 'స్వరాజ్యాన్ని', 'సామ్రాజ్యంలో వలస స్వపరిపాలన' అని నిర్వచించారు. దీనిని సాధించడానికి విదేశీ వస్తు బహిష్కరణను, స్వదేశీ పరిశ్రమల్ని ప్రోత్సహించుట, జాతీయ విద్య అనే నినా

దాలు కార్యక్రమంలో ప్రధానాంశాలైనవి. ప్రధాన రాజకీయ నినాదంగా 'స్వరాజ్యం' అనేది ప్రతిధ్వనించింది.

ఈ కార్యక్రమంలో జాతీయోద్యమం అతివేగంగా పురోగమించింది. ఒక సంవత్సరం తర్వాత మితవాదులకు, అతివాదులకు మధ్య 1907 సూరత్ కాంగ్రెసులో చీలిక వచ్చింది. అతివాదుల పలుకుబడి చూచి మితవాదులు యీచీలిక పెట్టారని ఆనాడు బహుళంగా ప్రచారమయింది. ఆ తర్వాత రెండువర్గాలు ప్రత్యేకంగా పెరిగాయి. 1916 లో మాత్రమే యీరెండు చీలికలు ఏకమయ్యాయి. 1918 లో మితవాదులు కాంగ్రెసును వదలి వెళ్ళి లిబరల్ ఫెడరేషన్‌ను ఏర్పరచుకొన్నారు.

ఉద్యమం పురోగమించినకొలదీ నూతన చైతన్యంతో బాటు ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రారంభమయింది. 1907 లో రాజద్రోహ సభల చట్టము, 1910 లో పత్రికా నిరోధచట్టము, 1818 రెగ్యులేషన్ పునాదులమీాద డిటెన్షన్ చట్టము ఒకదాని తర్వాత ఒకటి ప్రవేశపెట్టబడ్డాయి. విచారించకుండా ప్రవాసం పంపే పద్ధతి అమల్లోకి వచ్చింది. అతివాదులపై నిర్బంధం తీవ్రంగా సాగింది. 1908 లో ప్రభుత్వాన్ని గడగడలాడించిన తిలక్‌ను తన వార్తాపత్రికలో ఒకవ్యాసం వ్రాసినందుకు కేసు పెట్టి ప్రభుత్వం ఆయనకు 6 ఏండ్లు శిక్ష విధించింది. 1914 లో యుద్ధం ప్రారంభమయ్యేవరకు తిలక్‌ను 'మాండలే' జైలులో బంధించి వుంచారు.

తిలక్‌ను అరెస్టు చేసినందుకు నిరసనగా బొంబాయి బట్టల మిల్లు కార్మికులు సర్వవ్యాప్త సమ్మె చేశారు. భారత

కార్మికవర్గం జరిపిన ప్రథమ రాజకీయ సమ్మె యిదే. దీనిలో భవిష్యత్ ఎంతో యిమిడివున్నదని ఆనాడు లెనిన్ యీ సమ్మెను అభినందించాడు.

1906 నుండి 1909 లోపల ఒక్క బెంగాలులోనే 550 కేసులు పెట్టబడ్డాయి. పోలీసులు ఎడతెరపిలేకుండా పనిచేశారు. సభలను విచ్ఛిన్నం చేశారు. పంజాబులో రైతు పోరాటాలను తీవ్రంగా అణచివేశారు. బడిపిల్లలనుసైతం జాతీయగీతాలు పాడినందుకు అరెస్టు చేశారు.

## మింటో - మోర్లే సంస్కరణలు

ఒకవైపున నిర్బంధ చట్టాల నన్నింటినీ ప్రయోగించి తీవ్ర దమననీతిని కొనసాగిస్తూనే మరోవైపున మితవాదులను కూడగట్టుకు రావడానికి ప్రభుత్వం సంస్కరణలను ప్రవేశపెట్ట బూనుకొన్నది.

మింటో - మోర్లే సంస్కరణలు 1909 లో ప్రవేశపెట్ట బడ్డాయి. ఇండియా మంత్రి, ఇండియా వైస్రాయిలైన మింటో - మోర్లేల మధ్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు చూస్తే యీ సంస్కరణల ఉద్దేశ్యమేమిటో స్పష్టంగా బోధ పడుతుంది. మోర్లే మింటోకు వ్రాసిన ఒక జాబులో యిలా వ్రాశాడు: "లండన్‌లోకాని, కలకత్తాలోకాని భారతదేశ విధానాన్ని నడపడంలో వుండవలసిన ప్రధాన ప్రమాణం, పరీక్ష ఏమిటంటే ఏ కొత్త సంస్కరణలు పెట్టినా, అవి సార్వభౌమాధికారాన్ని బలపరిచేవిగా పదిలపరిచేవిగా వుండాలి." ఇంకా యిలాగే మోర్లే ప్రభువుల సభలో ఉపన్యసిస్తూ

యీ సంస్కరణలు అతివాదులను వేరుచేసి మితవాదులను ఆక ర్షించడానికేనని స్పష్టం చేశాడు.

ఈ సంస్కరణల ద్వారా అదివరకు అమల్లోవున్న ఇండియన్ కౌన్సిల్ చట్టంలోని ప్రాతినిధ్యం కొంత విస్తృత మయింది. రాష్ట్ర శాసన సభల్లో పరోక్షంగా ఎన్నుకోబడిన సభ్యులే మెజారిటీగా వుంటారు. వైస్రాయి లెజిస్లేటివ్ కౌన్సి ల్లోకి మైనారిటీ సంఖ్యలో ఎన్నుకోబడిన సభ్యుల్ని చేర్చు కొంటారు. కాని యీ కౌన్సిళ్ళ కార్యక్రమంపై అనేక నిబంధ నలు, నిర్బంధాలు వున్నాయి. పరిపాలనమీద కాని, ఆర్థిక వ్యవహారాలమీద కాని యీ కౌన్సిళ్ళకు అధికారం లేదు. వీరి నిర్ణయాలను వైస్రాయి ఆమోదించకుండా నిరాకరించ వచ్చు. ఓటింగు హక్కు సంకుచితం చేయబడ్డది. ప్రత్యేక ముస్లిం నియోజకవర్గాలు ప్రవేశపెట్టబడ్డాయి.

ప్రభుత్వ ప్రతినిధులు ఆశించినట్లుగానే ఆనాడు కాంగ్రె సుపై సంపూర్ణ అధికారంగల మితవాద నాయకులు యీ సంస్కరణలను ఆమోదించి ఆహ్వానించారు. 1910 లో కొత్తగా దిగిన వైస్రాయికి రాజభక్తి ఉట్టిపడే విజ్ఞప్తిపత్రాన్ని సమర్పించారు. 1911 లో బెంగాలు విభజన విషయం పునః పరిశీలిస్తానని చక్రవర్తి ప్రకటించడమే తడవుగా కాంగ్రెసు నాయకులు తమ హర్షాన్ని, విశ్వాసాన్ని యిలా ప్రకటించారు: "బ్రిటిష్ రాజనీతిజ్ఞత ఎడల కృతజ్ఞత, పునర్విశ్వాసము వెల్లి విరుస్తున్నాయి. ప్రతి హృదయము బ్రిటిష్ ప్రభుత్వంపై గౌరవ ప్రతిపత్తులతో స్పందిస్తున్నది."

మితవాదులతో సంస్కరణల నామోదింప జేయడంలో ప్రభుత్వం జయం పొందినప్పటికీ 1911 లో బెంగాలు విభజననుగూర్చి పునరాలోచించడం మాత్రం బహిష్కర ణోద్యమానికి అఖండ విజయాన్ని చేకూర్చింది. 1905 - 11 మధ్య సాగిన పోరాట వెల్లువ ఆతర్వాత మందగించింది. కాని ఉద్యమస్థాయిలో సాధించిన పురోగమనము, ఫలితాలు మాత్రం స్పష్టం. ఆకాలపు అతివాదనాయకులలో ఎన్ని లోపా లున్నప్పటికీ ఆ సంవత్సరాలలోనే భారతస్వాతంత్ర్య వాంఛను ప్రాధాన్యతకు తెచ్చారు. సంపూర్ణ స్వాతంత్ర్య ఆశయానికి ఆరోజుల్లోనే బీజం నాటబడింది.

## గదర్ - టెర్రరిస్టు ఉద్యమాలు

1900–1918 సంవత్సరాలమధ్య బెంగాలులో టెర్రరిస్టు ఉద్యమము, పంజాబులో గదర్ ఉద్యమము వ్యాప్తిలోకి వచ్చాయి.

టెర్రరిస్టు ఉద్యమం :- కాంగ్రెసులోని తీవ్రవాదులు పైన వివరించినట్లు మతపునాదులమీద జాతీయ ఉద్యమాన్ని నిర్మించ బూనుకొన్నారు. ప్రజాఉద్యమాలను నిర్మించాలనే దృష్టి లోపించి, వ్యక్తిగత హింసావాదంద్వారా విదేశీ నాగరి కతను, దురాక్రమణను ఎదిరించి నాశనం చేయగలమను కొన్నారు. ఈ విధంగా ప్రారంభమైన యీ వ్యక్తి దౌర్జన్య వాదం బెంగాలు విభజన ఉద్యమానంతరం మరింత హెచ్చు స్థాయికి పోయింది. ఉద్యమాన్ని అణచడానికి ప్రభుత్వం అనేక నిర్బంధ చట్టాలు ప్రవేశపెట్టి, ప్రజలపై ప్రయోగించిందని పైన

చెప్పుకొన్నాము. ప్రజలపై ప్రభుత్వం సాగించిన దారుణ హింసాకాండకు ప్రతీకారంగా వ్యక్తి దౌర్జన్యవాదం చెలరేగింది. ఒకవైపున మితవాద నాయకులు ప్రజల అసంతృప్తికి పోరాట రూప మివ్వకుండా, ప్రభుత్వంతో సహకార విధానాలకు పూనుకొంటుంటే అసంతృప్తిచెందిన అతివాద యువకవర్గాలు ప్రభుత్వ దమననీతిని యీ రూపంలో ఎదుర్కొన సాగారు. బ్రిటిష్ దేశస్థుల్ని వ్యక్తులుగా తుదముట్టించే సాహసిక చర్యల ద్వారా బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని తరిమివేయగల మనుకున్నారు.

గదర్ ఉద్యమం:—1913-18 ల మధ్య యీఉద్యమం ముఖ్యంగా పంజాబులో వ్యాపించింది. 'గదర్' అంటే సైనికులని అర్థం. సైనికులు తిరుగుబాటుచేసి నూతన ప్రభుత్వ స్థాపనకై సాయుధపోరాటం సాగించాలని ఉద్దేశించిన ఉద్యమమే గదర్ ఉద్యమం. ప్రథమ ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజుల్లో గదర్ ఉద్యమం విజృంభించింది. లాలా హరదయాళు, భాయి పరమానందులు దీనికి మూలపురుషులు. అమెరికాలో మకాంపెట్టి అక్కడకు చేరిన భారత విద్యార్థు లందరినీ సమీకరించారు. జర్మన్, అమెరికా దేశాల సాయంతో ఆయుధాలను సేకరించి భారతదేశంలోకి దిగుమతిచేయడం, ప్రజల్లోఅసంతృప్తి నుపయోగించి వారిని సాయుధంగా తిరగబడేలా చేయడం, సైనికుల్లో కూడ తిరుగుబాటుతత్వం లేవగొట్టడం, అన్నిటికంటె ముందు బర్మాదేశాన్ని పట్టుకొని అక్కడినుంచి ఉద్యమాన్ని వ్యాపింపజేసి బ్రిటిషువారిని భారతదేశంనుంచి తరిమివేయడం — ఇదీ గదర్ ఉద్యమంయొక్క ప్లాను. యుద్ధకాలంలో యీ ఉద్యమానికి జర్మనీ సహాయం తీసుకోవాలని పూర్తిగా ప్రయత్నిం

చారు. చివరకు వీరి ప్లానులన్నీ బయటపడిపోయాయి. ప్రభుత్వం యీ ఉద్యమాన్ని తీవ్రంగా అణచివేసింది. ఒక్క పంజాబులోనే రాజద్రోహ నేరమారోపించి షుమారు 5 వేల మంది మీద కేసులు పెట్టారు. మిలిటరీ కోర్టు 500 మందికి ఉరిశిక్ష విధించింది; 800 మందికి యావజ్జీవ శిక్ష విధించి అండమాను దీవులకు పంపింది. ఎలాంటి కేసులూ లేకుండానే షుమారు 10 వేల మంది 'ఇంటరన్' (ఒక ప్రాంతందాటి బయటికి పోకుండా) చేయబడ్డారు.

ఈ టెర్రరిస్టు ఉద్యమంలో ప్రారంభదశలో హిందూ మత ప్రాబల్యం వుండేది. కాని క్రమ క్రమంగా మత ప్రభావం తగ్గి, సోషలిస్టు భావాలు ప్రవేశించాయి. అయినా ప్రజలతో నిమిత్తం లేకుండానే ఆశయాన్ని సాధిద్దామనుకొన్నారు. గదర్ వీరులు 5 గురు బయలుదేరి బర్మాదేశాన్ని స్వాధీనం చేసుకుందామని కలలుగన్నారంటే వాస్తవ పరిస్థితులకు విరుద్ధమైన వీరి సాహసిక చర్యల పర్యవసాన మేమిటో అర్ధమవుతుంది. అయితే భగత్ సింగు నాయకత్వాన 'హిందూస్తాన్ రిపబ్లికన్ ఆర్మీ' ఏర్పడి పనిచేయునాటికి కొంత మార్పు వీరిలో వచ్చింది. చివరి రోజుల్లో వ్యక్తి దౌర్జన్య పద్ధతిద్వారా సాధించలేమనీ, ప్రజా ఉద్యమాలను పెంపొందించాలనే అభిప్రాయాలు బలపడసాగాయి. శిక్ష లనుభవించి బయట పడిన బెంగాలు టెర్రరిస్టులు, పంజాబు గదర్ వీరులు అనేకమంది ఆ తర్వాత కమ్యూనిస్టు పార్టీలో చేరి పనిచేస్తున్నారు.

# రెండవ పోరాట వెల్లువ 1919-'22

1914 లో సామ్రాజ్యవాదుల మధ్య చెలరేగిన ప్రథమ ప్రపంచ మహాయుద్ధం సామ్రాజ్యవాద వ్యవస్థపై శాశ్వతమైన దెబ్బతీసింది. సామ్రాజ్యదేశాల మధ్య సాగిన తగాదా కోటాను కోట్ల ప్రజల్లో సామ్రాజ్యవాద వ్యవస్థ అభేద్యమన్న భీతిని పోగొట్టి ఉత్సాహాన్ని రేకెత్తించింది. దీనికితోడు 1917 నవంబరు విప్లవంతో జారు సామ్రాజ్యం కూలిపోయింది. ప్రపంచమంతటా విప్లవ తరంగాలు వ్యాపించాయి. వీటి ప్రభావం భారత జాతీయోద్యమంమీద కూడ ప్రతిబింబించింది. 1917 తర్వాత భారతదేశంలో తిరిగి జాతీయపోరాట వెల్లువప్రారంభమయింది.

ఈ పరిస్థితుల ప్రభావం గమనిస్తున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదం యుద్ధప్రారంభంలోనే తీవ్ర నిర్బంధ చర్యలకు పూను కొన్నది. పరిస్థితుల నదుపులో పెట్టుకొనేందుకు ఇండియా రక్షణచట్టాన్ని ప్రవేశపెట్టింది. పైన ఉదహరించినటుల టెర్రరిస్టు, గదర్ ఉద్యమాల నణచే పేరుతో తీవ్రవాద యువకుల్ని, పోరాటాలకు తయారవుతున్న విప్లవవర్గాలకు చెందిన ప్రజల్ని వేలాది మందిని జైళ్ళలో నిర్బంధించింది.

యుద్ధానికి సహకారం :- ప్రభుత్వం యీ విధంగా దారుణ నిర్బంధాలు కొనసాగిస్తున్న సమయంలోనే మితవాదుల పలుకుబడిలోనున్న కాంగ్రెసు, యుద్ధాన్ని బలపరుస్తూ తన రాజ భక్తిని ప్రదర్శించింది. 1914, 1915, 1916 సంవత్సరాలలో జరిగిన కాంగ్రెసు మహాసభలకు మద్రాసు గవర్నరు లార్డ్ పెంట్లండు, బొంబాయి గవర్నరు లార్డు వెల్లింగ్టన్, యు. పి. గవర్నరు

జేమ్సు మెస్టన్‌లు వసుసనే హాజరయ్యారు. కాంగ్రెసు ప్రతినిధులు వీరికి జేజేలు కొట్టారు. యుద్ధ ప్రారంభ సమయంలో లండనులోనున్న కాంగ్రెసు ప్రతినిధులైన లజపతిరాయ్, జిన్నా, సిన్హాగారలు భారత మంత్రివద్దకు రాయబారం వెళ్ళారు. యుద్ధానికి తాము సహాకరించడానికి సిద్ధంగా వున్నామని ఆనుర్దాను ప్రదర్శించారు. అదే సమయంలో దక్షిణాఫ్రికానుండి లండను వచ్చిన గాంధీగారు తనకు సన్మానం జరిగిన సందర్భంలో యుద్ధ ప్రయత్నాలకు తనను, భారత ప్రజలను చక్కగా ఉపయోగించుకోండని బ్రిటిష్ అధికారులకు విన్నవించారు. వెంటనే కార్యాచరణకు దిగారుకూడా. లండనులో భారతీయ ఆంబ్యులెన్సు దళాన్నొకదానిని గాంధీగారు ఏర్పాటు చేశారు. లండనునుండి భారతదేశానికి తిరిగి వచ్చిన వెంటనే వైస్రాయిని కలుసుకొని సహాకారానికి తన సంసిద్ధతను తెలియజేశారు. వైస్రాయి పిలిచిన ఢిల్లీ యుద్ధ కాన్ఫరెన్సుకు హాజరై యుద్ధ ప్రయత్నాలకు, ప్రచారానికి నడుంకట్టి పనిచేయ పూనుకొన్నారు. సైన్యంలో చేరి స్వరాజ్యాన్ని సాధించమని గాంధీగారు గుజరాతీ రైతుల్లో ప్రబోధిస్తూ చేర్పించారు.

రాజకీయనాయకత్వం ఒకవైపునయుద్ధంలో యీవిధంగా సహాకరిస్తోంది. మరోవైపున ప్రజల్లో విపరీతమైన అసంతృప్తి, అలజడి చెలరేగుతున్నాయి. ధరలు పెరిగిపోయి, లాభాలు గుంజడం అధికమైపోయి ప్రజలు పేదరికానికి గురి అయ్యారు. ఫలితంగా యుద్ధం ముగిసిన అనంతరం విషజ్వరాలకు, అంటు వ్యాధులకు గురియై 1 కోటి 40 లక్షలమంది చనిపోయారు.

దీనిద్వారా ప్రజల దరిద్రస్థితి ద్యోతక మవుతుంది. ఈ అశాంతి గదర్ ఉద్యమంద్వారాను, సైనిక కుట్రల్లోను ప్రతిబింబించింది.

అంతేగాదు; ప్రజల్లో రేగిన యీ అశాంతి మరికొన్ని రాజకీయరూపాలు కూడ ధరించింది. తిలక్ నాయకత్వాన 'హోమ్‌రూల్ లీగ్' స్థాపించబడింది. అనిబిసెంట్ కూడ యీ ఉద్యమంలో చేరి, ఉద్యమాన్ని సామ్రాజ్యంపట్ల భక్తి విశ్వాసాలు కలిగివుండే దారిలో నడుపుటకు పూనుకొన్నది.

1916 లో, లక్నో కాంగ్రెసులో అతివాద మితవాద నాయకుల మధ్య సామరస్యం ఏర్పడింది. అలాగే యిదే సంవత్సరంలో కాంగ్రెసు-లీగుల మధ్య ఐక్యత ఏర్పడటంకూడ ఒక ప్రముఖ సంఘటనగా చెప్పవచ్చు. టర్కీకి వ్యతిరేకంగా జరిగిన యుద్ధం ముస్లింలలో మార్పు తెచ్చి, యీ ఘటనకు దారి తీసింది. కాంగ్రెసు-లీగుల ఒడంబడికకు ప్రభుత్వ సంస్కరణలను ఆమోదించే పునాదికూడ ఒక కారణమైనది. సామ్రాజ్యంలో భాగంగా, పాక్షిక స్వపరిపాలనా సంస్కరణలను ఆమోదించడం కాంగ్రెసు లీగులకు అంగీకారమయింది.

# 1917 రౌలట్ కమిటీ నియామకం-చెమ్సుఫర్డు సంస్కరణలు

ప్రజల అసంతృప్తిని, తీవ్రవాదుల కార్యాచరణను అణచివేయడానికి 1917 లో ఒకవైపున రౌలట్ కమిటీని నియమిస్తూ, అదే సంవత్సరం మితవాదుల నాకర్షించడానికి

మాంటేగూ - చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలను తీసుకువస్తానని ప్రభుత్వం ప్రకటించింది.

అంతవరకూ జరుగుతున్న విప్లవోద్యమానికి సంబంధించిన కుట్రలు వగైరాలను విచారించడానికీ, ప్రజల అసంతృప్తిని అణచివేసే మార్గాల నన్వేషించడానికీ రౌలట్ కమిటీని నియమించింది. ఆ కమిటీ తయారుచేసే రిపోర్టు ఆధారంతో కొత్త రూపంలో నిర్బంధ విధానాలను అమలు జరుప నిశ్చయించింది.

అదే సమయంలో 1917 రష్యన్ విప్లవ విజయం సామ్రాజ్యవాదుల్ని హడలెత్తించింది. రష్యన్ ప్రజల విజయం జాతీయ స్వతంత్రపోరాటాల కొక మార్గం చూపింది. ఉత్సాహాన్నిచ్చింది. అనేక దేశాలు తమ విముక్తియుద్ధాలను తీవ్రతరం చేశాయి. దీనితో బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశంలో ఏదో ఒక పేరుతో మితవాదులనైనా సంతృప్తి పరిస్తేతప్ప గత్యంతరం లేదని గ్రహించింది. లార్డ్ కర్జన్, ఆస్టెన్ చాంబర్లేనుల పూర్తి సలహా సంప్రదింపులతో మాంటేగూ - చెమ్స్‌ఫర్డులు తయారుచేసిన సంస్కరణలను త్వరత్వరగా ప్రకటించింది. ఈ ప్రకటనలో "బ్రిటిష్ సామ్రాజ్యంలో విడివడని భాగంగా భారతదేశంలో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని త్వరగా సాధించే ఉద్దేశంతో స్వపరిపాలనా సంస్థల క్రమాభివృద్ధే బ్రిటిష్ ప్రభుత్వ ఆశయ"మని వెల్లడించారు. ఈ ప్రకటన జరిగిన తర్వాత సంవత్సరానికిగాని మాంటేగూ-చెమ్స్‌ఫర్డు పూర్తి నివేదిక తయారుకాలేదు. రెండు సంవత్సరాల తర్వాత చట్టమై 1920 లో మాత్రమే అమల్లోకి వచ్చింది.

1918 లో మాంటేగూ నివేదిక బయటికి రాగానే బొంబాయిలో జరిగిన ప్రత్యేక కాంగ్రెసు సమావేశంలో యీ సూచనపట్ల ఆశాభంగాన్నీ, అసంతృప్తినీ వెలిబుచ్చారు. మితవాదులు యీ నిరసనను అంగీకరించలేదు. కాంగ్రెసునుండి బయటకుపోయి 'ఇండియన్ లిబరల్ ఫెడరేషన్'ను స్థాపించారు. సామ్రాజ్యవాదులతో సహకారాన్ని అర్థించారు. గాంధీగారు మాత్రం కాంగ్రెసు లోపలేవుండి 'అనిబిసెంట్' తోడ్పాటుతో సంస్కరణలను అంగీకరింపజేయడానికి తీవ్రకృషి చేయ బూనుకొన్నారు. సి. ఆర్. దాసు సంస్కరణలపట్ల విముఖత వహించి గాంధీగారికి ప్రత్యర్థిగా నిలబడ్డారు. గాంధీగారు 1919 డిసెంబరు 31 వ తేదీన 'యంగ్ ఇండియా' పత్రికలో యీ సంస్కరణలు ఇండియా ప్రజలకు న్యాయం కలుగజేయడానికి వుద్దేశింపబడినవేనని ప్రకటించారు. రౌలట్ యాక్టు అమల్లోకి వచ్చిన తర్వాత, అమృతసర్ ఘోర దురంతాల తర్వాత, పంజాబులో మార్షల్‌లా ప్రకటించిన తర్వాతనే గాంధీగారు యిలాంటి ముఖ్యప్రకటనతో ముందుకు రావడం గమనింపదగిన విషయం. ఎందుచేతనంటే తర్వాత వచ్చిన సహాయ నిరాకరణోద్యమానికి కారణాలివేనంటూ సాధారణంగా చెప్తారు. దీనినిబట్టి సహాయ నిరాకరణోద్యమానికి యింకా అనేక యితర కారణా లున్నాయనేది స్పష్టం. ఆ కారణా లేమిటి?

నూతన పరిస్థితులు :— కాంగ్రెసు యుద్ధకాలంలోను, ఆ తర్వాతకూడ ప్రభుత్వంతో సహకరించే నైఖరి తీసుకొన్నది. అయినప్పటికీ 1919 లో భారతదేశ పరిస్థితులలో నూతన మార్పు వచ్చింది. దేశమంతటా అశాంతి వ్యాపించింది. ఇంతకు

ముందెన్నడూ భారతదేశంలో జరగనంత పెద్ద ఎత్తున సమ్మె ఉద్యమం ప్రారంభమయింది. 1918 డిసెంబరులో ప్రారంభమైన బొంబాయిమిల్లు సమ్మె 1919 జనవరికల్లా 1 లక్షా 25 వేల మందికి వ్యాపించింది. 1919 డిసెంబరులో ఒకవైపున గాంధీ గారు తన సహకార విధానాన్ని ప్రకటిస్తూండగానే 1920 మొదటి 6 నెలల్లోను 200 సమ్మెలు జరిగాయి. 15 లక్షల మంది కార్మికులు పాల్గొన్నారు. ఇలా కార్మికవర్గం ఆ నాడు ప్రజల్లో వస్తున్న అసంతృప్తికి ఉద్యమరూపంలో మార్గదర్శి అయింది.

ప్రజల అసంతృప్తి యిలా ఉద్యమ రూపం దాలుస్తున్న సమయంలోనే రౌలట్ యాక్టు అమల్లోకివచ్చింది. ప్రజలక్రోధాగ్ని యినుమడించింది. దీనికిఅసమ్మతిగా బొంబాయికార్మికులు జనరల్ సమ్మె చేసారు. గాంధీగారు శాంతియుతంగా ప్రతిఘటించడానికి సత్యాగ్రహలీగును ఏర్పాటు చేశారు. ఇదే సమయంలో అమృతసరులో జనరల్ డయ్యర్ దురంతాలు అగ్నిలో ఆజ్యం పోసినట్లయ్యాయి. జలియన్‌వాలా బాగ్‌లో జనరల్ డయ్యర్ నిరాయుధులైన ప్రజలమీద 1600 రౌండ్లు కాల్పించాడు. 379 మంది చనిపోయారు. 1200 మంది గాయపడ్డారు. ఈ ఘన కార్యానికి డయ్యర్ సేనాని 20 వేల పౌనుల బహుమతిని సామ్రాజ్యవాదులనుండి స్వీకరించాడు. ఈ ఘటనలతో అంతకుముందే ప్రారంభమైన కార్మిక సమ్మెలు, హెచ్చు పన్నులు రద్దుచేయాలని సాగించబడుతున్న రైతుల ఉద్యమాలు రాజకీయ ప్రదర్శనాలరూపం ధరించాయి. దేశమంతటా అసమ్మతి సభలు జరిగాయి. ప్రభుత్వంపై సహాయ

నిరాకరణోద్యమం సాగించాలనే ఆందోళన కాంగ్రెసులో బయలుదేరింది. ముస్లిం ప్రజా సామాన్యంలోను, విద్యార్థికుల్లోను టర్కీపై బ్రిటిష్ ప్రభుత్వంచేసిన యుద్ధానికి అసమ్మతిగా ద్వేషం ఏర్పడింది. దీనితో ఖిలాఫత్ ఉద్యమం బయలుదేరింది. హిందూ మహమ్మదీయ ఐక్యత ఏర్పడింది. పంజాబు హత్యలతో జాతీయోద్యమం ఉచ్ఛదశకు పోయింది. మరోవైపున ప్రభుత్వ నిర్బంధం తీవ్రతరమయింది. మార్షల్‌లా ప్రకటించబడింది. పంజాబులో మిలిటరీ ట్రిబ్యునల్సు ఏర్పడ్డాయి. దీర్ఘ కాల శిక్షలు, తుపాకి కాల్పులు నిత్యకృత్యమై పోయాయి.

1919 డిసెంబరులో కూడ బ్రిటిష్ ప్రభుత్వ సంస్కరణలను అమలు జరపడానికి సిద్ధమని గాంధీగారు ప్రకటించారు. పంజాబు సంఘటనల అనంతరం కూడ తాను సత్యాగ్రహం ప్రారంభించి, కొండంత పొరపాటు చేశానని విచారాన్ని వెలిబుచ్చాడు. అలా విచారపడిన గాంధీగారే 1920 లో పరిస్థితులు తమను మించిపోతున్నాయని గ్రహించి, సహకార నినాదాన్ని మార్చివేశారు. గాంధీగారు, యితర ప్రధాన కాంగ్రెసు నాయకులు ప్రజా ఉద్యమానికి నాయకత్వం వహించ నిశ్చయించారు. 1920 సెప్టెంబరులో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెసు సమావేశం జరిగింది. సహాయ నిరాకరణోద్యమం సాగించుటకు నిశ్చయించబడింది. ఈ క్రింది కార్యక్రమం నిర్ణయించబడింది:

1. న్యాయస్థానాలు, ప్రభుత్వ విద్యాలయాలు, శాసన సభలను బహిష్కరించుట.

2. ప్రభుత్వోద్యోగములను, బిరుదులను వదలివేయుట.

3. నిర్మాణ కార్యక్రమం (ఖద్దరు కట్టడం, రాట్నాలు త్రిప్పడం, అస్పృశ్యతా నివారణ).

ఈ ప్రణాళికను 'అహింసాయుత సహాయ నిరాకరణం' అని పేరుపెట్టి నొక్కిచెప్పారు. కాంగ్రెసు, ప్రజలకు నాయకత్వం వహించి నడుపుతానని చెప్పింది. కాని ప్రజలు 'అహింసా యుతంగా' మాత్రమే పోరాటం నడపాలని కోరింది. పై కార్య క్రమంలో మొదటి రెండు విషయాలు కేవలం మధ్యతరగతుల వారు, ఉద్యోగులు, వకీళ్ళు, విద్యార్థులు మాత్రమే అనుసరించ దగినది. ఇక సామాన్య ప్రజలు - రైతులు, కూలీలు చేయ వలసిందేమిటి? వడుకొంటూ, గాంధీజపం చేసుకొంటూ కూర్చోడం. ప్రజలందర్నీ కదిలించే పన్నుల నిరాకరణ, భావి కాలానికి అట్టిపెట్టబడింది. విప్లవ భావాలతో కూడి అసం తృప్తితోనున్న ప్రజలకు నాయకత్వం వహించి ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోకుండా హద్దులలోనే వుంచి నీరుగార్చడం పై కార్యక్రమంయొక్క ఉద్దేశం.

1920 డిసెంబరులో నాగపూరులో జరిగిన కాంగ్రెసు సమావేశం యీ నూతన కార్యక్రమాన్ని ఏకగ్రీవంగా ఆమో దించింది. ఈ సమావేశంలోనే 'సామ్రాజ్యంలో వలసదేశపు స్వపరిపాలన' అన్న పూర్వపు ఆశయాన్ని తొలగించి, "స్వరా జ్యాన్ని శాంతియుతమైన న్యాయపద్ధతులతో సాధించుట" ఆశయమని ప్రకటించారు.

ఈ నూతన కార్యక్రమంతో ముందుకు పోతున్నామని ప్రజల్లో ఆశ రేకెత్తింది. కాంగ్రెసు ప్రతిష్ట హెచ్చింది. ప్రభు

త్వానికి వ్యతిరేకంగా ప్రజాపోరాటాన్ని నడిపే పార్టీగా కాంగ్రెసు నిలబడింది.

కాని యీ నూతన కార్యక్రమంలో ప్రజాపోరాట పద్ధతికి భిన్నమైనట్టి పెటీబూర్జువా ధర్మబోధనల ఊహాగానం, సంస్కరణవాదుల శాంతివాదం ఒక అంశంగా కనిపిస్తుంది. ఈ అంశం 'అహింసాయుతం', 'శాంతియుతం', అన్న పదాలలో గర్భితమై వుంది. ఈ పదంలో అంతిమ పోరాట నిరాకరణమే గాక పై వర్గాల ప్రయోజనాలకోసం ప్రజాసామాన్య ప్రయోజనాలను బలియిచ్చే ధోరణి కనబడుతుంది. అంతేగాదు; తాత్కాలిక ప్రయోజనాలకోసం జరిగే పోరాటాన్నికూడ ఆపివేసే అవకాశం ఆ పదంలో గర్భితమై వుంది. అదే తర్వాత చరిత్ర తెలియజేస్తుంది.

కాంగ్రెసు నాయకత్వం కార్యక్రమాన్ని యిన్ని హద్దుల్లో బంధించి వుంచినప్పటికీ ఉద్యమం ముందుకు సాగింది. ఒక్క సహాయ నిరాకరణోద్యమం ముందుకు సాగడమే గాక, దేశం నలుమూలలా ప్రజా పోరాటాలు అనేక రూపాల్లో విజృంభించాయి. బెంగాలు - అస్సాం రైల్వేలో బ్రహ్మాండమైన కార్మిక సమ్మె జరిగింది. బెంగాలులోని మిడ్నపూరు జిల్లాలో పన్నుల నిరాకరణ జరిగింది. మలబారులో మాప్లా రైతులు తిరుగుబాటు చేసి 6 మాసాలపాటు ప్రభుత్వ సైన్యాలను సాయుధంగా ఎదుర్కొని చీకాకుపరిచారు. పంజాబులో ధనవంతులైన మహాంతులకు ప్రభుత్వం రక్షణ యివ్వగా, వారికి వ్యతిరేకంగా 'అకాలీ' ఉద్యమం చెలరేగింది. ఈ పరిస్థితుల్లో దేశమంతటా

వలంటీరు ఉద్యమం వ్యాపించింది. కాంగ్రెసులోను, ఖిలాఫత్ ఉద్యమంలోనుకూడ వలంటీరు ఉద్యమం అభివృద్ధి చెందింది.

1921 ఆఖరుకు పోరాటం ఉన్నతస్థాయి నందుకొన్నది. వేలకొద్ది వలంటీర్లు ప్రచారక దళాలుగా తయారయ్యారు. ప్రభుత్వంలో కలవరపాటు ఎక్కువయింది. 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు'ను దించడంద్వారా పరిస్థితులు చక్కబడతాయని ప్రభుత్వం ఆశించింది. వేల్సు యువరాజు రాకను నవంబరు 17 న దేశ మంతటా ప్రజలు హర్తాళులతో ఎదుర్కొన్నారు. ప్రజల అసంతృప్తి యీహర్తాళులద్వారా స్పష్టంగా ప్రదర్శితమయింది. ప్రజల ద్వేషం, ప్రభుత్వ క్రూర నిర్బంధ విధానం చిన్న చిన్న ఘర్షణలకు దారి తీసింది. వీటిని జరగకుండా ఆపాలని గాంధీజీ ప్రయత్నించి విఫలుడయ్యాడు. 'స్వరాజ్యం' దుర్వాసన వేస్తున్నది అని ప్రకటించాడు.

ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రతరమయింది. ముఖ్యంగా వలంటీర్లపై ప్రయోగించబడింది. వేలకు వేల మందిని అరెస్టు చేసింది. 1921 సం॥ ఆఖరుకు 30 వేల మంది అరెస్టు చేయ బడ్డారు. గాంధీగారు మినహా, మిగతా నాయకులందరూ అరెస్టయ్యారు. ప్రభుత్వం ఉక్కిరి బిక్కిరయింది. పట్టణాలతోబాటు పల్లెల్లోని రైతుకోటికూడా లేస్తే ప్రభుత్వానికి దిక్కూ మొక్కూ లేకుండా పోయేస్థితి ఏర్పడ్డది. దీనితో ప్రభుత్వం రాజీ రాయబారాలు ప్రారంభించింది. పండితమాలవ్యా మధ్యవర్తిత్వంతో వైస్రాయి జైళ్ళలోని నాయకులతో రాజీబేరాలు సాగించాడు. కాని రాజీ కుదరలేదు.

అలాంటి ఉద్రిక్తపరిస్థితిలో అహమ్మదాబాదు కాంగ్రెసు జరిగింది. గాంధీగారొక్కడే నాయకుల్లో బయటఉన్నారు. అహమ్మదాబాద్ కాంగ్రెసు సహాయ నిరాకరణోద్యమాన్ని కొనసాగించడానికి గాంధీగారిని డిక్టేటరుగా నియమించింది. అసంతృప్తితో కుమిలిపోతున్న రైతులకు భవిష్యత్తులో పన్నుల నిరాకరణోద్యమాన్ని సాగిస్తానని కాంగ్రెసు వాగ్దానం చేసింది. కాని వాస్తవానికి ఉద్యమాన్ని ఎలా ఆపివేయాలా అని గాంధీజీ ఆలోచిస్తున్నారు. గాంధీజీ పన్నుల నిరాకరణకు పిలుపు యిస్తారని రైతులంతా ఆదుర్దాగా ఎదురుచూస్తున్నారు. గాంధిగారు మాత్రం ఒక నెలరోజులపాటు మౌనం వహించి కూర్చున్నారు. ఈ నెలరోజుల్లో పన్నుల నిరాకరణకు అనుమతించమని అనేక జిల్లాలనుండి జాబులు వచ్చాయి. గుంటూరుజిల్లా పెదనందిపాడులో అనుమతి రాకముందే పన్నులనిరాకరణోద్యమం ప్రారంభమయింది. వెంటనే గాంధీ అన్ని జిల్లాలవారికీ 'పన్నులు చెల్లించివేయండంటూ' ఆదేశిస్తూ జాబులు వ్రాశారు. తాను స్వయంగా ఒక్క 'బార్డోలీలో' మాత్రమే ఉద్యమం సాగిస్తానని ప్రకటించారు. ఈప్రకటన జరిగిందో లేదో యింతలోనే ఒక వార్త వచ్చింది. యు. పి. రాష్ట్రంలోని 'చౌరీచౌరా' లో క్రోధోద్రిక్తులైన ప్రజలు పోలీసుస్టేషన్ను కాల్చివేశారు. 22 మంది పోలీసులు చనిపోయినారు. ఇంకేం! సాకుదొరికింది గాంధీ గారికి. వెంటనే 1922 ఫిబ్రవరి 12 వ తేదీన బార్డోలీలో వర్కింగు కమిటీని సమావేశపరిచారు. ఆ సమావేశంలో చౌరీచౌరా ప్రజలు అమానుషంగా ప్రవర్తించారని ఖండిస్తూ తీర్మానం చేయబడింది. కార్యక్రమాన్నంతటినీ ఆపివేయమని ఆదేశిస్తూ

మహాక తీర్మానం చేయబడింది. ఉద్యమం ఆగిపోయింది. కొండను త్రవ్వి ఎలుకను బట్టిన చందమయింది.

ఉద్యమా న్నీవిధంగా అకస్మాత్తుగా ఆపడంతో ప్రజల్లో నిస్పృహా వ్యాపించింది. జైల్లో ఉన్న మోతీలాలు, లజపతి రాయిలతో సహా ఉద్యమ విరమణకు అసమ్మతి తెలుపుతూ ఉత్తరాలు వ్రాశారు. జైల్లో వున్నవారు బయట కార్యక్రమ్మా లకు సంబంధించినంతవరకు 'మృతులక్రింద లెక్క' అని వారికి గాంధీజీ జవాబు వ్రాశారు. జైల్లో ఉన్న నాయకుల ఆమర్దాను, సలహాలకు గాంధీజీ అంతమాత్రనే విలువ యిచ్చారు.

ఉద్యమం నిరాశా నిస్పృహల పాలవడంతో, ప్రభుత్వం ధైర్యంతో ముందుకువచ్చి దెబ్బ తీసింది. మార్చి 10 వ తేదీన గాంధీగారినికూడ అరెస్టుచేసి, ఆరేళ్ళు శిక్ష విధించింది.

ఆ రోజుల్లో కాంగ్రెసు పిలుపిస్తే ప్రజల సంసిద్ధత ఏ రూపంలో వుందో గుంటూరుజిల్లా పెదనందిపాడు సత్యా గ్రహోదంతమే తెలియజేస్తుంది. పన్నులు కట్టవలసిందని గాంధీ గారి ఆదేశం వచ్చేవరకు, నూటికి 5 వంతులుకూడ శిస్తులు కట్టలేదు. కాంగ్రెసు ఆమోదిస్తే చాలు దేశమంతా అల్లుకు పోయే స్థితివుంది. పన్నులు, జమీందారీ శిస్తులతోసహా నిరాకరించబడేవి. అలాంటి కార్యక్రమమంటే సామ్రాజ్య వాదమేకాక, భూస్వామ్య విధానంకూడ తుడిచి పారవేయబడే స్థితి ఏర్పడేదన్నమాట.

అందుచేతనే బార్డోలీ నిర్ణయం ఆవిధంగా జరిగింది. ఈ బార్డోలీ తీర్మానాన్ని పరిశీలిస్తే కాంగ్రెసు నాయకత్వపు

స్వభావము, గాంధీగారి అహింసా విధానంలోని సత్యము స్పష్టంగా బోధపడుతుంది.

బార్డోలీ తీర్మానంలో పరిశీలించాల్సిన కొన్ని ముఖ్య సూత్రాలు:

1. పోలీసులను అమానుషంగా ఖూనీచేసి స్వేచ్ఛగా పోలీసు ఠాణాను కాల్చివేసిన, చౌరీచౌరాలోని గుంపుల అమానుష చర్యలను వర్కింగుకమిటీ తీవ్రంగా ఖండిస్తున్నది.

2. ప్రతిసారీ సమిష్టి శాసనోల్లంఘనం ప్రారంభించినపుడు హింసాకార్యాలు చెలరేగుతున్నవి. ఇవి దేశం తగినంత అహింసాయుతంగా లేదని సూచిస్తున్నవి. అందువల్ల సమిష్టి శాసనోల్లంఘనం నిలిపివేయాలి. భూమిపన్ను మొదలైన పన్నులన్నింటినీ ప్రభుత్వానికి చెల్లించేటట్లు చూడాలని స్థానిక కాంగ్రెసు సంఘాలను వర్కింగుకమిటీ ఆదేశిస్తున్నది.

3. (సూత్రం 6) :— రైతులకు యీక్రింది విధంగా తెలియజేయవలసిందని కాంగ్రెసు సేవకులకు, సంస్థలకు వర్కింగుకమిటీ సలహా యిస్తున్నది. జమీందారులకు గుత్తలు కట్టకుండా ఆపడం కాంగ్రెస్ తీర్మానాలకు విరుద్ధమైనది. దేశ యోగక్షేమాలకు నష్టకరమైనది.

4. (సూత్రం 7) :— వర్కింగుకమిటీ జమీందారులకు యీ విధమైన హామీయిస్తున్నది. కాంగ్రెసు వుద్యమం జమీందారుల చట్టబద్ధమైన హక్కులపై దెబ్బతీయడానికి ఏవిధంగానూ ఉద్దేశించలేదు.

—ఈ పైసూత్రాలను పరిశీలిస్తే గాంధీగారు కాంగ్రెసు వల్లించే యీ 'అహింసా' పదజాలమంతా నిజానికి పై వర్గాల

ప్రయోజనాలను, వర్గపీడనను కొనసాగించడానికి వేసుకొన్న ముసుగు మాత్రమేనని స్పష్టమవుతుంది. పోరాటం ఉధృతంగా హద్దులు దాటిపోయేస్థితిలో నాయకత్వంయొక్క ఊగిసలాట పాత్ర, సామ్రాజ్యవాదులతో రాజీధోరణుల వెనుకనున్న వర్గ స్వభావమేమిటో అర్థమవుతుంది.

ఈ దశలో 1922 ఉద్యమం ఆపివేయబడేనాటికి యింకా బలమైన కార్మికోద్యమం లేదు. కమ్యూనిస్టుపార్టీ అప్పటికింకా మనదేశంలో పుట్టనేలేదు. ఈ పరిస్థితుల్లో గాంధీ నాయకత్వం ప్రజలకు కొన్ని ప్రాథమిక పోరాటపద్ధతులు మాత్రం చూపింది. అంతవరకు ప్రజల్ని జాతీయోద్యమంలోకి ఆకర్షించింది. కాని ప్రజలు ముందుకువస్తున్న సమయంలో పైవర్గాల ప్రయోజనాలకు దెబ్బతగులకుండా హద్దుల్లో వుంచుటకు తగిన పద్ధతుల నన్నింటినీ అవలంబించింది. ఉద్యమాన్నాపటంలో జయించింది.

ప్రభుత్వానికి వ్యతిరేకంగా మధ్యతరగతివర్గాల అసంతృప్తి హెచ్చింది. అతివాద పెటీబూర్జువా నాయకులు గాంధీతత్వంతో అసంతృప్తిజెంది, పోరాటమును ముందుకు సాగించాలని ఎదురుచూచారు. కార్మికవర్గానికేమీ అంతవరకు కేంద్రనాయకత్వంలేదు. దానంతటదే సమ్మెలుచేస్తూ ఉద్యమాన్ని సాగిస్తోంది. కార్మికోద్యమం అతి ప్రాథమికదశలో మాత్రమేవుంది.



# జాతీయోద్యమంలో

## మూడవ పోరాట వెల్లువ 1930 - '34

బార్డోలీ నిర్ణయం జాతీయోద్యమాన్ని నీరసపరచింది. ప్రజల్ని నిస్పృహాలో ముంచివేసింది. అయిదేండ్లవరకు కాంగ్రెసు ప్రభావం సన్నగిలిపోయింది. 1924 లో కాంగ్రెసులో కోటిమంది సభ్యుల్ని చేర్చాలని నిర్ణయం తీసుకొని రెండు లక్షలమందిని చేర్చేటప్పటికి కష్టమైపోయింది. జాతీయోద్యమం నీరుగారిపోగానే విచ్ఛిన్న శక్తులు తల ఎత్తాయి. మత కలహాలు చెలరేగాయి. ముస్లింలీగు కాంగ్రెసునుండి విడిపోయింది. దీనికి ప్రతిగా హిందూమహాసభ సంకుచిత మత తత్వంతో తల ఎత్తింది.

కాంగ్రెసులో రెండు పక్షాలు తయారైనాయి. ఒకటి గాంధీగారి నాయకత్వాన నిర్మాణ కార్యక్రమం పక్షం, రెండవది సి. ఆర్. దాసు, మోతీలాల్ నెహ్రూల నాయకత్వాన శాసనసభాపక్షం. వడకడం, మితపానం, అస్పృశ్యతా నివారణ మొదలైన సాంఘిక సంస్కరణలు మాత్రమే విమోచన మార్గమని, గాంధీజీ అనుచరవర్గం వాటినే పట్టుకొని వ్రేళ్ళాడింది. ఇక రెండవపక్షం ప్రస్తుతం ఉద్యమమంతా నీరసించిపోయి నిస్తబ్ధతలో మునిగిపోయింది. కాబట్టి శాసన సభా కార్యక్రమాన్ని చేబడదామన్నది. రెండవ పక్షంవారు కాంగ్రెసులోనే స్వరాజ్యపార్టీగా ఏర్పడ్డారు. 1925 నాటికి యీ పార్టీకి కాంగ్రెసులో మెజారిటీ లభించి నాయకత్వా

న్నధిష్ఠించారు. దీనితో గాంధీగారు కాంగ్రెసు సాధారణ సభ్యత్వంకూడ వదలుకొని తెరవెనక్కు వెళ్ళారు.

ఇక స్వరాజ్యపార్టీవారు ప్రభుత్వంతో సహకారం నెరప బూనుకొన్నారు. ఉద్యమం నిస్తబ్ధతలో నున్నపుడు శాసనసభా కార్యక్రమాన్ని చేబట్టి, ప్రజల్ని ఉత్సాహపరచి వుద్యమాన్ని ముందుకు తీసుకుపోవడానికి, దాని నొక సాధనంగా వినియోగించడంలో ఆక్షేపణేమీ వుండకూడదు. కాని స్వరాజ్యపార్టీ నాయకత్వపు స్వభావ మదికాదు. మాటల్లో సి. ఆర్. దాసు మొదలైనవారు నూటికి 90 మంది ప్రజలతరఫున తాము పోరాడతామనీ, కార్మిక, కర్షక ప్రజల ప్రయోజనాలకోసం నిలబడతామనీ పదజాలం వాడుతూండేవారు. కాని తీరా ఆచరణకు వచ్చేటప్పటికి అటు సామ్రాజ్యవాదుల సందేహాలను తీర్చడానికీ, యిటు భూస్వామ్యవర్గాల బెదురు పోగొట్టడానికీ హామీలనిస్తూ, అమితమైన ఆదుర్దాను వెలిబుచ్చేవారు.

కాబట్టి ఆచరణలో స్వరాజ్యపార్టీ ఒకడుగు ముందుకు వేయాలనే వుద్దేశంతో బయలుదేరినప్పటికీ, ప్రజా పోరాటం నిలిపివేయబడిన దశకు ప్రతిబింబంగా మాత్రమే దానిని చూడాల్సివుంది. ఈ పార్టీ క్రమంగా సామ్రాజ్యవాదుల దరికి చేరుతూ, ప్రజలకు మరింత దూరమవుతూ వచ్చింది. చివరకు ప్రజా వుద్యమాన్ని విడచిపెట్టి, బలహీన పార్టీగా తయారయింది. ఈ బలహీనతను గ్రహించిన సామ్రాజ్యవాదం భారత పెట్టుబడిదారీవర్గంపైన వెంటనే దెబ్బ తీసింది. అదివరకు భారత బూర్జువావర్గాని కిచ్చిన సౌకర్యాలను రద్దు చేయుటకు పూనుకొన్నది. 1927 లో ప్రవేశపెట్టిన కరెన్సీ

బిల్లుద్వారా రూపాయి మారకాన్ని 1 షి. 6 పెన్నీలకు నిర్ణయించింది. అలాగే 1924 లో భారత ఉక్కు పరిశ్రమల కిచ్చిన రక్షణలను 1927 లో రద్దు చేసింది. ఆర్థికంగా భారత పెట్టుబడిదారీవర్గంపై యిలాంటి దాడిని సాగిస్తూ 1927 ఆఖరులో భారతీయుల కేమాత్రం ప్రాతినిధ్యం లేకుండా భారత రాజ్యాంగ భవిష్యత్తును నిర్ణయించేందుకు 'సైమన్ కమిషన్' ను వేశామని బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించింది.

సామ్రాజ్యవాదుల యీదాడు లన్నింటి మూలంగా భారత పెట్టుబడిదారీవర్గం బ్రిటిష్‌ప్రభుత్వంతో సహకరించే విధానంనుండి మరల వెనక్కు మళ్లింది. ప్రజలవైపు చూడాల్సిన అవసరం కలిగింది. కాని పదేళ్ళక్రితం కంటె పరిస్థితులు మారాయి. ప్రజాశక్తులుచైతన్యవంతం కాసాగాయి. సామ్రాజ్య తత్వానికి వ్యతిరేకంగానే కాక, భారత పీడకులకుకూడ వ్యతిరేకంగా పోరాడాలనే తత్వం క్రమంగా పెంపొందసాగింది. అందుచేత అటు సామ్రాజ్యవాదం మధ్య, యిటు ప్రజా సామాన్యం మధ్య ఊగిసలాటపాత్ర వహించే భారత పెట్టుబడి దారీ వర్గంయొక్క లక్షణం మరింత స్పష్టంగా బయట పడ జొచ్చింది. ఈ లక్షణం 1930-'34 సంవత్సరాల మధ్య సమగ్రరూపం ధరించింది.

నూతన శక్తులు రంగంలో ప్రవేశించాయి. 1920-'21 సంవత్సరాలలోనే యింకా నాయకత్వం వహించే స్థితికి రాక పోయినా, కార్మికవర్గం జాతీయోద్యమానికి తన సమ్మెలు, ప్రదర్శనాలద్వారా ప్రోత్సాహమిచ్చి ముందుకు త్రోసింది. సోషలిస్టు భావాలుప్రవేశించి పెంపొందుతున్న తొలిరోజుల్లోనే,

ప్రభుత్వం వాటిని మొగ్గలోనే త్రుంచివేయాలని 1924 లో కాన్పూరు కుట్రకేసు బనాయించింది. ఖిలాఫత్ ఉద్యమ సందర్భంలో టర్కీ వెళ్ళి తిరిగివస్తున్న ముస్లిం విద్యార్థికులు, విద్యార్థులు అయిన 'హిజ్రతీల' వద్ద సోషలిజానికి, సోవియటుకు సంబంధించిన రహస్య సాహిత్యం దొరికిందనీ, అలాగే యం. యన్. రాయి విదేశాలనుండి ఇండియాకు పంపిన రహస్య సాహిత్యం పట్టుబడిందనీ సాకు చూపి, 'డాంగే' ప్రభృతులను అరెస్టుచేసి యీ కుట్రకేసు పెట్టింది. నాల్గు సంవత్సరాలు శిక్ష విధించింది. ఈ కుట్రకేసు కాంగ్రెసులోని అతివాద యువశక్తుల్ని, సోషలిస్టు భావాలనుగూర్చి ఆలోచించేలా చేసింది. అటు తర్వాత 1926-'27 సం॥లలో కార్మిక కర్షకపార్టీ స్థాపించబడి, 1928 నాటికి కార్మికోద్యమం కొంత పురోగమించింది. 1928 లో రేషనలైజేషన్, రిట్రెంచిమెంటులకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన సమ్మె ఉద్యమం లేచింది. అంతకు ముందు 5సంవత్సరాలలో జరిగిన మొత్తంసమ్మెరోజుల సంఖ్యను యీ ఒక్క సంవత్సరంలోను మించిపోయింది. గిర్నికాంగార్ యూనియన్‌లో యీ ఒక్క సంవత్సరంలోనే 65 వేలమంది సభ్యులుగా చేరారు. సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా జరిగిన ప్రదర్శనాలలో కార్మికవర్గం ప్రధానపాత్ర వహించింది. కార్మికవర్గ పాత్ర భారత ప్రజల పోరాటంలో మహత్తర శక్తిగా పనిచేయ ప్రారంభమయింది.

ఇదేసమయంలో 1927 ఆఖరుకు జవహర్‌లాల్ నెహ్రూ విదేశయాత్ర ముగించుకొని అభివృద్ధికరభావాలతో ఇండియాకు తిరిగివచ్చారు. సరాసరి మద్రాసులో జరుగు

తున్న కాంగ్రెసుకు హాజరయ్యారు. ఈ సమావేశంలో అతివాదులకు, యువకులకు, నెహ్రూ, సుభాస్‌బోసులు నాయకత్వం వహించారు. ఈ సమావేశంలోనే ప్రప్రథమంగా కాంగ్రెసు ఆశయం 'సంపూర్ణ స్వాతంత్ర్యం' అనే తీర్మానం ఆమోదించబడింది. అంతవరకు రాజకీయాలనుండి విరమించి కాంగ్రెసు బయటవున్న గాంధీగారు యీ తీర్మానాన్ని 'తొందరపడి చేసిందీ, ఆలోచనలేకుండా ఆమోదించబడిందీ' నని విమర్శించారు. ఈ మద్రాసు కాంగ్రెసు సమావేశంలోనే సైమన్ కమిషన్‌ను బహిష్కరించాలని నిశ్చయించారు. నెహ్రూ, సుభాస్‌బోసులు ప్రధాన కార్యదర్శులుగ ఎన్నుకోబడ్డారు.

ఈ ఘటనలతో అతివాదుల శక్తి రోజు రోజుకూ పెరుగుతోందని పాతనాయకులకు స్పష్టమయింది. అంతకు ముందే కాంగ్రెసు వెలుపలకు పోయిన అభివృద్ధి నిరోధక మితవాద నాయకులతో కలిసి పాతనాయకులు మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన ఒక ప్రణాళిక తయారు చేశారు. దీనినే నెహ్రూ నివేదిక అంటారు. ఈ నివేదికలో బ్రిటిష్ సామ్రాజ్యంలో బాధ్యతాయుత ప్రభుత్వం కావాలని అర్థించబడింది. అయితే యీ ప్రణాళికను కాంగ్రెసు అంగీకరిస్తుందా అన్న అనుమానం మితవాద నాయకులకు కలిగింది. అందుచేత మితవాద నాయకులు యీ క్లిష్ట సమయంలో గాంధీగారి నాశ్రయించారు. మరల రంగంలోకి రమ్మని ఆహ్వానించారు. 1928 ఆఖరున జరిగిన కలకత్తా కాంగ్రెసులో గాంధీజీ తిరిగి నాయకత్వానికి వచ్చారు. గాంధీగారు నెహ్రూ నివేదికను సమర్థిస్తూ తన వాదనాపటిమ నంతనీ ప్రదర్శించారు. సంవత్సరంలోపల

ప్రభుత్వం యీ నివేదికను ఆమోదించకపోతే పన్నుల నిరాకరణకు పిలుపు నిస్తానని వాగ్దానం చేశారు. అయినా తీర్మానం చేశారు. అయినా తీర్మానం ఓటుకు పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. తీర్మానానికి వ్యతిరేకంగా నెహ్రూ, సుభాస్ బోసులు నిలబడ్డారు. 1350 ఓట్లు అనుకూలంతోను, 970 ఓట్లు ప్రతికూలంతోను తీర్మానం నెగ్గింది. ఈ కాంగ్రెసు సందర్భంలోనే కలకత్తా కార్మికులు 20 వేలమంది కాంగ్రెసు పెండాలులోకి ప్రవేశించి 'స్వతంత్ర భారత రిపబ్లిక్ ఏర్పడాలి' అని నినాదాలిస్తూ ప్రదర్శనాలు చేశారు. కాంగ్రెసు మితవాద నాయకత్వం యీ శక్తిని జాతీయోద్యమానికి అండగా తీసుకొనడానికి బదులు బెదురుతోను, ద్వేషంతోను చూచింది. పైవిధంగా ప్రభుత్వంతో రాజీకొరకు కెదురుచూచే తీర్మానం ఎలాగైతేనేం ప్యాస్ చేయించారు. ఒక సంవత్సరంపాటు ప్రభుత్వానికి వ్యవధి నివ్వటానికి యీ తీర్మానం తోడ్పడింది.

ఈ సంవత్సరం వ్యవధినీ ప్రభుత్వం చక్కగా విని యోగించుకొన్నది. 1920 - '22 సం॥ ల నాటి ఉద్యమానికీ, ముందు రానున్న జాతీయోద్యమ ఉధృతానికీ వుండే తేడాను ప్రభుత్వం గ్రహించింది. 1929 మార్చిలో ఆనాటి ప్రముఖ కార్మికవర్గ నాయకులందరినీ దేశం మొత్తంమీద అరెస్టు చేసింది. వీరిమీద మరల ఒక కుట్ర కేసు బనాయించి, మారు మూలనున్న మీరట్‌లో విచారణ జరపటానికి పూనుకొన్నది. కాన్పూరు కుట్ర కేసులో శిక్షితులైన డాంగే, ముజఫర్ అహమ్మదు, షౌకత్ ఉస్మానీలతో సహా 32 మంది మీద యీ కేసుపెట్టి దీర్ఘకాలం విచారణ జరిపారు. వీరిలో 3 రు ఇంగ్లీషు

కార్మికవర్గ ప్రతినిధులుకూడా వున్నారు. (బ్రాడ్లీ, స్ప్రాట్, హచిన్సన్లు). ప్రభుత్వం యీ మీరట్ కుట్ర కేసు ద్వారా కార్మిక వర్గానికి నాయకత్వం వహించేవారు లేకుండా చేసింది. అతివాదనాయకులను సమైక్యం కాకుండా చేసి, కాంగ్రెసు మిత వాద నాయకత్వపు పెత్తనంతో ఉద్యమం నడపవలసిన స్థితిని కల్పించింది. ప్రజారక్షణ శాసనాన్నికూడ ప్రవేశపెట్టి, తీవ్ర వాద నాయకులందరినీ నిర్బంధాలకు గురిచేయుటకు ప్రభుత్వం పూనుకొన్నది.

మరోవైపున మితవాద నాయకులు నెహ్రూ నివేదిక ప్రాతిపదికతో సామ్రాజ్యవాదంతో రాజీ పడేందుకు తీవ్రంగా ప్రయత్నించసాగారు. అధినివేశం యిస్తామంటూ వైస్రాయి చేసిన ఆగస్టు ప్రకటన చూచి తమ కోర్కె యీడేరిందని మితవాదులు సంబరపడ్డారు. జవహర్‌లాల్‌చేకూడ సంతకం చేయించి ఢిల్లీ మానిఫెస్టోను తయారు చేశారు. వైస్రాయిని కలుసుకొన్నారు. ఈ దౌర్బల్యాన్ని గ్రహించిన వైస్రాయి మొండిచేయి చూపాడు. వైస్రాయి తిరస్కారణతో సంప్ర తింపులు నిష్ఫల మైపోయినాయి.

1929 ఆఖరులో లాహోర్ కాంగ్రెసు జరిగింది. పై విధంగా ప్రయత్నాలు విఫలంకావడంతో అధినివేశ ప్రతి పత్తినిగూర్చి చెప్పిన నెహ్రూ నివేదిక విలువ పోయింది. అది అంతటితో రద్దయి పోయింది. "సంపూర్ణ స్వాతంత్ర్యం" కాంగ్రెసు ఆశయమని లాహోర్ కాంగ్రెసు ప్రకటించింది. "ఎప్పుడు అర్హమని తలిస్తే అప్పుడు శాసనోల్లంఘన కార్య క్రమం ప్రారంభించేందుకు, దానితోబాటు పన్నులనిరాకరణ

కూడ ప్రారంభించేందుకు" అఖిలభారత కాంగ్రెసు సంఘానికి అధికారమిస్తూ తీర్మానించబడింది. 1930 జనవరి 26 న దేశ మంతటా ప్రథమ స్వాతంత్ర్య దినోత్సవం జయప్రదంగా జరిగింది. ఉత్సాహం వెల్లివిరిసింది.

లాహోరు కాంగ్రెసులో ఆశయంమాత్రం స్పష్టంగానే ప్రకటించబడింది. కాని యీ ఆశయాన్ని సాధించడానికి పోరాట కార్యాచరణకు సంబంధించిన కార్యక్రమం మాత్రం ఏమీలేదు. ఈకార్యక్రమానికీ, కార్యాచరణకూ సంబంధించిన తీర్మానాన్ని, కార్మికుల్ని, రైతుల్ని సంఘటితపరిచే కార్యక్రమ తీర్మానాన్ని సుభాస్‌బోసు ప్రవేశపెట్టగా అది వీగిపోయింది.

పోతే, యిక ఆమోదించ బడినటువంటి, అందరినీ ఉత్సాహ పరచినటువంటి సంపూర్ణ స్వాతంత్ర తీర్మానంపై గాంధీగారు వ్యాఖ్యానాలు చేయడం ప్రారంభించారు. ఈ తీర్మానాన్ని చూచి ఎవరూ భయపడ నవసరంలేదని ప్రకటన లిచ్చారు. 1930 జనవరి 30 వ తేదీన తన 'యంగ్ ఇండియా' పత్రికలో 11 అంశాలతో కూడిన ఒక ప్రణాళికను ప్రకటించారు. ఈ సంస్కరణలను అంగీకరిస్తే శాసనోల్లంఘనాన్ని ప్రారంభించకుండానే నిలుపు చేస్తామన్నారు. ఈ విధంగా స్వాతంత్ర్యవాంఛను ఒకబేరంగా మాత్రమే పెట్టి, కొన్నిసంస్కరణలను మాత్రం షరతుగా పెట్టారు. దీనితో ప్రభుత్వానికి గాంధీ నాయకత్వాన జరిగే ఉద్యమ పరిమితు లేమిటో స్పష్టంగానే అర్థమయాయి.

1930 ఏప్రిల్‌లో జరిగిన అఖిలభారత కాంగ్రెసు కమిటీ గాంధీగారే వుద్యమానికి నాయకత్వం వహించాలని తీర్మా

నించింది. ప్రజల్ని సమీకరించే కార్యక్రమ మేమీ యీ సమావేశ మివ్వలేదు. అహింసా విధానంపై మాత్రం గాంధీగారి ప్రకటనల ప్రవాహం కొనసాగింది. స్వతంత్ర పోరాటంలో విజయం సాధించేదానికంటే, తాను అహింసకే ఎక్కువ ప్రాముఖ్య మిస్తానన్నారు. అందుకోసం స్వతంత్రాన్ని సైతం త్యాగం చేస్తానన్నారు. అంతేగాదు; తాను రెండు రంగాలలో ఒకేసారి పోరాటం సాగించాల్సిన అవసర మేర్పడిందన్నారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగానే కాక, భారతదేశంలోని అంతశ్శత్రువుమీదకూడ పోరాడతానన్నారు. అంటే తన అహింసా హద్దులు దాటిపోయే ప్రజా వుద్యమాలకు వ్యతిరేకంగా పోరాడతానని స్పష్టంగా వెలిబుచ్చడ మన్నమాట.

స్వతంత్రాన్ని సాధించడానికి జరిగే పోరాటంపట్ల గాంధీగారి యొక్క యీ భావాల ననుసరించే ఆయన పోరాట ఎత్తుగడకూడ వుంటూవచ్చింది. ఈ ఎత్తుగడ స్వతంత్రాన్ని పూర్తిగా సాధించేవరకు ప్రజల్ని ముందుకు నడిపేదిగాదు. కాని వుద్యమాన్ని తన చెప్పుచేతల్లో వుంచుకొంటూ తాను కోరిన పరిమితుల్లో మాత్రం వుంచగల్గుతుంది. ఆ విధంగామాత్రం మంచి శక్తివంతమైన ఎత్తుగడే. దాని కనుగుణ్యమైన ఉప్పు సత్యాగ్రహ పద్ధతిని గాంధీగారు చేపట్టారు. ఈ పోరాటంలో కార్మికవర్గం పాల్గొనకుండా చేయడానికి వీలు చిక్కింది. రైతులయొక్క ఆదరాన్ని సంపాదించి, భూస్వాములపై తమ పోరాటాన్ని సాగించకుండా పక్కదారులు పట్టించడానికి తోడ్పడింది. అందరినీ ఆకర్షించే, నినాదమూ అయింది. ఈ ఉద్యమంలో ఎవరూ పాల్గొనకుండా తాను, తన ముఖ్య

శిష్యులు 78 మంది మాత్రమే పాల్గొనుటకు పరిమితం చేశారు గాంధీగారు.

ఈ 78 మంది శిష్యులతో గాంధీగారు సాగించిన దండీ సత్యాగ్రహయాత్ర ప్రజలందరి దృష్టినీ ఆకర్షించింది. గాంధీగారు యీ సారితో స్వాతంత్ర్యాన్ని సాధించి పెడతారు అనే ఉత్సాహం సర్వత్రా ప్రబలింది. ఈ యాత్రను గురించి ప్రదర్శనాలు, ప్రచారమూ జోరుగా సాగాయి. గాంధీగారి మహాత్మ్యపై ప్రజాదృష్టి యావత్తూ కేంద్రీకరించబడింది. ప్రజల దృష్టినంతటినీ తాము స్వయంగా పాల్గొనవలసిన పోరాటాల నుండి మళ్ళిస్తున్న యీ ప్రచారాన్ని' యీ సత్యాగ్రహ ప్రదర్శనాన్ని, బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు ఎట్టి అడ్డంకీ లేకుండా కొనసాగనిచ్చారు. అదే సమయంలో మరోవైపున సుబాస్ బోస్‌లాంటి తీవ్రవాదులను ప్రారంభంలోనే అరెస్టు చేశారు.

గాంధీగారు ఉద్యమాన్ని ఎన్నిహద్దుల్లో పెట్టి బంధించి నప్పటికీ, ఏప్రియల్‌లోనే అభివృద్ధిచెందిన ప్రజాఉద్యమం కట్టలు తెంచుకొని ముందుకు సాగింది. సమ్మెలు, శక్తివంతమైన ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి. బెంగాలులో చిటగాంగు ఆయుధాగారం కొల్లగొట్టబడింది. పెషావర్ పట్టణం పది రోజులపాటు ప్రజల చేతుల్లో వుంది.

పెషావరులో జరిగిన ఒక సంఘటన చరిత్రలో మరపురానిది. కోపోద్రేకులైన ప్రజల్ని అణచివేయడానికి ప్రభుత్వం సాయుధ శకటాలను పంపింది. ఆ సదర్భంలో గార్వాలీ సైనిక దళం ఒకటి ప్రజలపై కాల్పులు చేయ నిరాకరించింది. సేన నుండి చీలివచ్చి యీ దళంవారు ప్రజలకు తమ ఆయుధాల్ని

స్వాధీనం చేసారు. తర్వాత ప్రభుత్వం వీరిని విచారించి యావజ్జీవ శిక్షలు, దీర్ఘకాల శిక్షలు విధించింది. తన దోపిడీని కొనసాగించడానికి దౌర్జన్యంమీద బ్రతికే ప్రభుత్వానికి అలా చేయడం సహజమే. అయితే యీ సందర్భంలో యీ సైనికుల చర్యపట్ల అహింసామూర్తిఅయిన గాంధీగారి వైఖరి ఏమిటి అని ప్రతి ఒక్కరికీ కుతూహలం కల్గుతుంది. ప్రజలపై కాల్పులు చేయ" నిరాకరించి, అహింసాయుతంగా సత్యాగ్రహం చేసిన యీ సైనికుల దేశభక్తి చర్యపట్ల గాంధీగారు ఏహ్యాభావాన్ని వెలిబుచ్చారు. అంతేకాదు, వారు క్రమశిక్షణ తప్పినందుకు శిక్షించాల్సిందేనని సామ్రాజ్యవాదుల కసాయితనాన్ని సమర్థించారు. కాంగ్రెసు అధికార చరిత్రలో గార్వాలీ సైనికుల యీ వీరోచిత ఉదంతాన్నే ఉదహరించలేదు.

ఇక ఉద్యమం గాంధీగారు పెట్టిన హద్దుల్ని దాటి పోతోందని స్పష్టంకాగానే, మే 5 వ తేదీన ప్రభుత్వం గాంధీగారిని అరెస్టు చేసింది.

గాంధీగారి అరెస్టు జరిగిన వెంటనే హర్తాళులు, ప్రజా సమ్మెలు దేశమంతటా ఉవ్వెత్తున లేచాయి. షోలాపూరులో 50 వేల సంఖ్యలోనున్న కార్మికులు ఒక వారం రోజులపాటు పట్టణాన్ని తమ స్వాధీనంలో వుంచుకొన్నారు.

దీనితో ప్రభుత్వపు ఆర్డినెన్సుల పరంపర ప్రారంభమయింది. కాంగ్రెసు చట్ట విరుద్ధ సంస్థగా ప్రకటించబడింది. మొత్తం పది నెలల్లో 90 వేల మంది కాంగ్రెసు వలంటీర్లు, నాయకులు శిక్షించబడ్డారు. జైళ్ళు నిండిన వెంటనే పిల్లా పెద్దా విచక్షణ లేకుండా దారుణ నిర్బంధ విధానం సాగింది. లాఠీ

చార్జీలు, సమిష్టి జరిమానాలు, కాల్పులు యథేచ్ఛగా సాగాయి.

ఎన్ని నిర్బంధాలు ప్రయోగించినా, ఒకవైపున సాయుధ సైన్యాలు ఎడతెగని కాల్పులు చేస్తున్నా, బొంబాయిలాంటి మహానగరంలోసైతం ఎన్నోసార్లు ప్రజలు కొన్ని వీథుల్ని స్వాధీనం చేసుకొన్నారు. సామ్రాజ్యవాదుల్లో తత్తరపాటు హెచ్చింది. జైల్లోవున్న గాంధీగారితో మరల రాయబారాలు ప్రారంభమైనాయి. 1931 జనవరి 20 వ తేదీన బ్రిటిష్ ప్రధాని మాగ్డొనాల్డు భారతదేశ అధినివేశ హోదానుగూర్చి ఒక అస్పష్టమైన ప్రకటన చేశాడు. జనవరి 26 న గాంధీగారితో సహా వర్కింగు కమిటీని విడుదలచేశారు. అనేక సంప్రదింపులు జరిగాయి. చివరకు మార్చి 4 వ తేదీన 'గాంధీ – ఇర్విన్ ఒడంబడిక'తో పోరాటం తాత్కాలికంగా ఆపివేయబడినట్లు ప్రకటించబడింది.

గాంధీ – ఇర్విన్ ఒడంబడికద్వారా కాంగ్రెస్ పోరాటంలోని ఏఒక్క ఉద్దేశ్యమూ నెరవేరలేదు. చివరకు ఉప్పు పన్ను తీసివేయడమనేది కూడ జరగలేదు. వచ్చిన లాభమల్లా శాంతియుతంగా విదేశ వస్త్రాలను బహిష్కరించే హక్కు ఒకటి మాత్రమే.

లాహోర్ కాంగ్రెసులో ప్రకటించిన సంపూర్ణ స్వతంత్ర ఆశయం గాలిలో కలిసిపోయింది. గాంధీ – ఇర్విన్ ఒడంబడిక బార్డోలీ అనుభవాన్ని పెద్దఎత్తున పునశ్చరణ చేసింది. అంతే.

కరాచీలో కాంగ్రెస్ సమావేశమై యీ ఒడంబడికను ఏకగ్రీవంగా ఆమోదించింది. అయినా సమావేశంలో ప్రతి

ఘటన రాకపోలేదు. ఒక ప్రతినిధి "గాంధీజీ కాకుండా ఇలాంటి ఒడంబడికను ఇంకెవరైనా చేసుకొనివ్వుంటే, వానిని సముద్రంలో పడవేసివుండును" అని అన్నాడు. కరాచీలో నెహ్రూ మొదలైన అతివాద నాయకుల లొంగుబాటుతో గాంధీ స్థానానికి మరింత బలం చేకూరింది. అతివాదుల్ని సంతృప్తిపరచడానికి కరాచీ కాంగ్రెసులో అభ్యుదయవంతమైన సాంఘిక, ఆర్థిక కార్యక్రమాన్ని మాత్రం 'ప్రాథమిక పౌరహక్కుల' తీర్మానంలో వ్రాసి ఆమోదించారు.

ఒడంబడిక ననుసరించి భారతదేశ ప్రతిపత్తి సమస్యను చర్చించడానికి లండనులో జరిగే రౌండ్ టేబిల్ సమావేశానికి గాంధీజీ హాజరయ్యారు. లండనులో ఒకవైపున యీ ప్రహసనం జరుగుతూండగానే, ఉద్యమాన్ని అణచివేయడానికి అవసరమైన ఏర్పాట్లన్నీ సామ్రాజ్యవాదులు పూర్తిచేసుకొన్నారు. 1932 జనవరి 5 వ తేదీన రౌండ్ టేబిల్ సంప్రతింపులు భగ్నమయ్యాయి. అదే క్షణంలో ప్రభుత్వం పెద్దపెట్టున దాడి ప్రారంభించింది. గాంధీగారితో బాటు భారతదేశమంతటా కాంగ్రెసు నాయకులను, కార్యకర్తలను అందరినీ అరెస్టుచేసింది. నిషేధాజ్ఞలన్నీ అమలుపరచబడ్డాయి. మార్చి ఆఖరుకల్లా 1 లక్షా 20 వేలమందిని ప్రభుత్వం అరెస్టుచేసింది. భారీఎత్తున హింసాకాండ సాగింది. మిలిటరీ దాడులు, సమిష్టి జరిమానాలు, ఆస్తుల స్వాధీనం మొదలైనవన్నీ అమలు జరిగాయి. ఇన్ని నిర్బంధాలమధ్య కూడ 1934 మే వరకు ఉద్యమం కొనసాగింది. కాని గాంధీగారుమాత్రం ఉద్యమ విఫలతకు కారణాలను వివరిస్తూ తప్పంతా ప్రజలపైనే మోపారు.

ప్రజలవద్దకు చేరేటప్పటికి సత్యాగ్రహ సందేశం కలుషితమై పోతోందన్నాడు.

1934 మేలో అఖిల భారత కాంగ్రెసు సంఘం సత్యాగ్రహాన్ని బేషరతుగా ఆపివేసేందుకు పాట్నాలో ప్రభుత్వ అనుమతితో సమావేశమయింది. ఆపివేస్తున్నామని నిర్ణయించింది. రానున్న ఎన్నికలలో పోటీ చేయుటకుకూడా కాంగ్రెసు నిర్ణయించింది.

జూన్ నెలలో కాంగ్రెసుపై నిషేధం తొలగింది. జులైలో ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టీని నిషేధించింది. రైతు, యువజన సంఘాలపైనా, సరిహద్దు రాష్ట్ర 'రెడ్ షర్ట్‌ల' పైనా నిషేధాన్ని అలాగే వుంచింది.

1934 లోనే గాంధీజీ తిరిగి కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా నిచ్చారు. కాంగ్రెసులోని అధిక సంఖ్యాకులు అహింసను ప్రధాన సిద్ధాంతంగా అంగీకరించకపోవడమే అందుకు కారణమన్నారు. సోషలిస్టు గ్రూపుల పలుకుబడి కాంగ్రెసులో పెరగటంకూడ ఒక కారణంగా పేర్కొన్నారు.

గాంధీగారు పేరుకు కాంగ్రెసునుండి వైదొలగారన్నమాటే గాని, తెరవెనుక అతి శక్తివంతమైన నాయకుడుగా ఆయన కూర్చున్నారు. అవసరమైనపుడు ప్రత్యక్ష నాయకత్వం వహించడానికి ఎప్పుడూ సిద్ధమే. ఆవిధంగా 1939-40 లోను, 1942 లోను ఆయన ప్రత్యక్ష నాయకత్వం కనబడుతుంది.

1930, 34 పోరాటం అపజయంతో ముగిసిందని విచారపడవలసిన పనిలేదు. నాయకత్వం జాతీయోద్యమాన్ని రెండవ

పర్యాయం యీ విధంగా కృంగదీసి నప్పటికీ, ఉద్యమంయొక్క ఫలితాలుమాత్రం ఎక్కడికీ పోలేదు. ఆనాల్గు సంవత్సరాలలోను స్వాతంత్ర్యోద్యమాన్ని అణచివేయడానికి సామ్రాజ్యవాదం తన వద్దనున్న నవీన ఆయుధాల నన్నింటినీ ఉపయోగించింది. స్వతంత్ర పోరాటాన్ని నిర్మూలించానని కలలు గన్నది. కాని ఆ ఆశమాత్రం భగ్నమయింది. తాత్కాలికంగా వెనుకంజ వేసినా ఆ తర్వాత ఉద్యమస్థాయి, ప్రజల చైతన్యం పెరిగాయే గాని,తరగలేదని చరిత్ర రుజువుచేసింది.

# కార్మికోద్యమము - కమ్యూనిస్టుపార్టీ

కార్మికుల్లో సోషలిస్టు అభిప్రాయాల ప్రచారం 1924 లో మాత్రమే ప్రారంభమయింది. డాంగే 'సోషలిస్టు' అనే పత్రికను ప్రారంభించాడు. ఇంతలోనే పైన చెప్పినట్లు కాన్పూరు కుట్ర కేసు బనాయించి 4 సంవత్సరాలు శిక్ష విధించబడింది. 1926,27 సం॥లలో సోషలిస్టు అభిప్రాయాలు మరింత తీవ్రంగా వ్యాపించాయి. కార్మిక-కర్షకపార్టీలు స్థాపించబడి కార్మికుల్ని ఏకంచేయుటకు ప్రయత్నాలు జరిగాయి. 1928 లో కార్మిక కర్షక పార్టీయొక్క అఖిలభారత కాన్ఫరెన్సు జరిగింది. కార్మికుల చైతన్యం పెరిగింది. తమ ఆర్థిక హక్కులకోసం పోరాడ్డమే గాక, జాతీయస్వాతంత్ర్యోద్యమంలో తమపాత్ర వహించాలని గుర్తించారు. 1928 లో కలకత్తా కాంగ్రెసు సందర్భంలో 20 వేల మంది కార్మికుల ప్రదర్శనం దాని ఫలితమే. 1929 లో జరిగిన నాగపూర్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు సమావేశంలో

సైమన్ కమిషన్‌కు వ్యతిరేకంగా తీర్మానాలు చేశారు. ప్రదర్శనాలు జరిగాయి. ఈ రాజకీయ వాతావరణాన్ని చూచి యన్. యం. జోషి, శివరావు మొదలైన మితవాద నాయకులు చీలిపోయారు. అటుతర్వాత 1931 లో కలకత్తాలో కార్మికోద్యమంలో యింకొక చీలిక ఏర్పడింది. కార్మికవర్గ స్వతంత్ర పాత్రమీద చర్చలు జరిగిన మీదట యీ చీలిక వచ్చింది. దీనితో కమ్యూనిస్టుల నాయకత్వాన ఒకవర్గం చీలిపోయి, రెడ్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును స్థాపించారు.

ఈ చీలిక లేర్పడుతున్న క్లిష్టసమయంలోనే 1929 మార్చిలోనే కార్మిక నాయకులందరినీ అరెస్టుచేసి, మీరట్ కుట్రకేసు పెట్టిన సంగతిని పైన చూచాము. 1933 వరకు మీరట్ కేసు విచారణలు కొనసాగాయి. దీని ఫలితంగా క్లిష్ట సమయంలో కార్మికవర్గానికి తగిన నాయకత్వం లేకపోవడంతో, కార్మికోద్యమంలో విచ్ఛిన్నకారులకు అవకాశం దొరికింది. కమ్యూనిస్టులు సెక్టేరియన్ రాజకీయాలకు గురి అయ్యారు. మీరట్ కుట్రకేసునుండి నాయకులు బయటకు వచ్చినతర్వాత మాత్రమే, మరల కార్మికోద్యమాన్ని ఐక్యం చేయుటకు ప్రయత్నాలు జరిగాయి.

ఈ దశలో కమ్యూనిస్టుపార్టీని నిర్మించుటకు ప్రయత్నాలు జరిగాయి. కాని పార్టీ కేంద్రం ఏర్పడలేదు. కార్మిక వర్గంలో సోషలిస్టు ప్రచారము, ఆ వర్గంనుంచి వచ్చిన ఉత్సాహవంతులకు మార్క్సిస్టు అధ్యయన తరగతులు నడపటం వరకు జరిగింది. కాని కేంద్ర నాయకత్వం ఏర్పడకపోవటం మూలాన, ముఖ్యమైన కార్మిక నాయకులు అరెస్టుకావడంతో

శాసనోల్లంఘనంపట్ల సరియైన వైఖరి తీసుకోలేకపోయారు. సంస్కరణవాద పోరాటంగా ఎంచి, సెక్టేరియన్ దృష్టితో బయటనున్నవారు ఉద్యమానికి దూరంగా వుండిపోయారు. ఈ విధంగా కార్మిక నాయకత్వం వహించాల్సిన పాత్ర వహించ లేకపోయేటప్పటికి జాతీయోద్యమానికి ఎంతో నష్టం జరిగింది.

# రెండవ ప్రపంచ యుద్ధానికి ముందు - ఆ తర్వాత

1930 – '34 జాతీయ పోరాట వెల్లువ అనంతరం స్వాతంత్ర్యోద్యమాన్ని రెండు దశలుగా విభజించవచ్చు. యుద్ధం ప్రారంభమయ్యేవరకు ఒక దశ. యుద్ధకాలము, యుద్ధానంత రము మరొక దశ.

1930 – '34 శాసనోల్లంఘనం పైన చెప్పినట్లు కొన్ని ఫలితాలు సాధించినా, లక్ష్యాన్ని సాధించడంలో విఫల మయింది. కాంగ్రెసు నూతన పంథా అవలంబించుటకు నిశ్చ యించింది. శాసనసభలద్వారాకూడ పోరాటం సాగించాలని తీర్మానించింది.

ఇటు సామ్రాజ్యవాదం నూతన రాజ్యాంగ విధానాన్ని అమలు జరపడానికీ, తద్వారా సామ్రాజ్యవాద సంకెళ్ళను మన దేశంపై మరింత బిగించడానికీ పూనుకొన్నది. అన్ని తరగతుల ప్రజల్లోను 1935 రాజ్యాంగ చట్టంపట్ల తీవ్ర అసంతృప్తి ఏర్పడింది. ఈ చట్టానికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించడానికి ఎంతో అనుకూలమైన పరిస్థితులున్నాయి.

కాని కాంగ్రెసు తన కార్యక్రమాన్నంతనీ పార్లమెంటరీ రంగానికే మార్చడం మూలాన, ఫెడరల్ రాజ్యాంగ విధానానికి వ్యతిరేకంగా చెలరేగిన యీ సంచలనాన్నంతనీ సంఘటితపరచే కార్యక్రమం యివ్వలేకపోయింది.

1936 ఏప్రిల్‌లో జరిగిన లక్నో కాంగ్రెసునాటికి పరిస్థితుల్లో కొంత మార్పు వచ్చింది. శాసనసభ లోపలా, బయటాకూడ ఫెడరల్ రాజ్యాంగచట్టానికి వ్యతిరేకంగా పోరాటం సాగించడానికి తీర్మానించబడింది. అంతేగాదు. భారతదేశ స్వతంత్ర పోరాటం ప్రపంచ ప్రజలు సాగిస్తున్న ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ వ్యతిరేక, పోరాటంలో అంతర్భాగమే ననికూడ తీర్మానించబడింది. కాంగ్రెసుకు బయట ఏర్పడిన కార్మిక, కర్షక, యువజనోద్యమాలతో కాంగ్రెసు దగ్గర సంబధం పెట్టుకోవాలని నిర్ణయించబడింది.

ఈ కార్యక్రమాన్నే యింకా స్పష్టంగా 1936 డిసెంబరులో జరిగిన ఫైజ్‌పూర్ కాంగ్రెసు అంగీకరించింది. రైతు కోర్కెలపై ఆధారపడిన ఒక వ్యవసాయ కార్యక్రమం కూడ తయారు చేయబడింది. కాంగ్రెసు యిలాంటి తీర్మానాలు, కార్యక్రమము అంగీకరించడానికి కాంగ్రెసు వెలుపల అభివృద్ధి చెందుతూ వచ్చిన ప్రజాసంరంభమే ముఖ్య కారణం.

## కాంగ్రెసు వెలుపల ప్రజా సంరంభం

కార్మికోద్యమ ప్రభావం మూలంగాను, కమ్యూనిస్టుల ప్రచార ఫలితంగాను జాతీయోద్యమంలో పాల్గొన్న యువకుల్లో చాల మార్పు కల్గింది. గాంధీజం ఎడల పూర్తి అసంతృప్తి

కల్గింది. జైళ్ళలో సోషలిస్టు సిద్ధాంతాలపై బాగా అధ్యయనం చేశారు. జైళ్ళనుంచి బయటకు రాగానే కార్మికుల్లోను, రైతు, కూలీల్లోను, యువకుల్లోను సంఘాలునిర్మించి పనిచేయడం ప్రారంభించారు. మన ఆంధ్ర దేశంలోకూడ '30-'34 శాసనోల్లంఘనంలో జైళ్ళకు వెళ్ళివచ్చిన వారిద్వారాను, బెనారెస్ యూనివర్సిటీకి వెళ్ళివచ్చినవారిద్వారాను యీ ఉద్యమం ప్రారంభమయింది. ఈప్రజాసంఘాల్లోపనిచేసేవారే, అనేకమంది కమ్యూనిస్టుపార్టీ ప్రభావం క్రిందికి వచ్చారు. వీరందరూ జాతీయోద్యమంలో పాల్గొన్నవారవటంచేత, వీరి కార్యకలాపాల ప్రభావం కాంగ్రెసుపైకూడ పడింది. కాంగ్రెసు సంఘాలు ప్రజావుద్యమాలకు నాయకత్వం వహించాలనీ, అభివృద్ధి చేయడానికి పూనుకోవాలనీ ఒత్తిడి కాంగ్రెసు నాయకత్వంపై హెచ్చింది. దీనికి తోడు ప్రపంచ వ్యాపితంగా ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమ ప్రభావం కూడ పడింది. అందుచేత కాంగ్రెసు లక్నో, ఫైజ్‌పూర్ కాంగ్రెసులలో నూతన కార్యక్రమాన్ని అంగీకరించాల్సి వచ్చింది. గత ఉద్యమంలో ప్రభుత్వం జాతీయోద్యమంపై తీసిన దెబ్బను దృష్టిలోపెట్టుకొని కూడ, మరల శక్తుల నన్నింటినీ కూడగట్టడం ద్వారానే ప్రభుత్వాన్నెదుర్కోగలమనీ, నాయకత్వాన్ని స్థిరపరచుకోగలమనీ కాంగ్రెసు నాయకత్వం గ్రహించింది.

# 1937 - '38 కాంగ్రెసు మంత్రివర్గాలు - ఉద్యమ పురోగమనం

1930 – '34 సం॥ల మధ్య జరిగిన వుద్యమాలను ప్రభుత్వం అణచివేసినా ప్రజల్లో రాజకీయ చైతన్యం ఎంతో పెరిగింది. కాంగ్రెసు నాయకత్వం ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడంలో ఎన్ని లోపాలు చేసినప్పటికీ, వేలమంది కాంగ్రెసువాదులు జైళ్ళకు వెళ్ళడం, లాఠీచార్జీలకు, తీవ్ర నిర్బంధాలకు గురికావడం ప్రజలు కళ్ళారా చూచారు. ప్రభుత్వం తమపై గావించిన అత్యాచారాలను, హింసాకాండను అనుభవించారు. ప్రభుత్వానికి ప్రతిద్వంది గా కాంగ్రెసు నాయకత్వం వహించి ఉద్యమాన్ని నడపడం, అనేక త్యాగాలు చేయడం చూచారు. ఈ విధంగా కాంగ్రెసు పలుకుబడి ప్రజానీకంలో విపరీతంగా పెరిగింది.

దీనికితోడు లక్నో, ఫైజ్‌పూర్ కాంగ్రెసులలో ఇచ్చిన కార్యక్రమంతో కాంగ్రెసు పలుకుబడి, ప్రతిష్ట హెచ్చింది. సామ్రాజ్య వ్యతిరేక శక్తులన్నింటికీ కాంగ్రెసు కేంద్రంగా తయారయింది. కాంగ్రెసును జాతీయైక్యసంఘటన వేదికగా నిర్మించి, సామ్రాజ్య వ్యతిరేక పోరాటాన్ని సాగించడానికి మంచి అవకాశం వచ్చింది. ఈ విషయాన్నే విపులీకరిస్తూ కామ్రేడ్స్ దత్తు, బ్రాడ్లీలు 1936 జనవరిలో ఒక థీసిస్‌ను ప్రకటించారు. కాంగ్రెసులో వచ్చిన మార్పులను బట్టీ, కాంగ్రెసుకు దేశంలోనున్న స్థానాన్నిబట్టి కాంగ్రెసుద్వారా

సంయుక్త సంఘటనను ఎలా నిర్మించ వచ్చునో ఆ థీసిస్‌లో వివరించబడింది.

ఈ ప్రతిష్ట అంతటితోను 1937 శాసనసభా ఎన్నికల్లో కాంగ్రెసు పాల్గొన్నది. ఫైజ్‌పూర్ కాంగ్రెసులో ఎన్నికల ప్రణాళికను స్పష్టంగా రూపొందించింది. ప్రధానంగా 1935 రాజ్యాంగ చట్టాన్ని భగ్నంచేయడానికే ఎన్నికల్లో పాల్గొం టున్నట్లు కాంగ్రెసు స్పష్టం చేసింది. ఎన్నికల ప్రచారంలో లక్షలమంది యువకులు కాంగ్రెసు దేశంకోసం చేసిన త్యాగా లనూ, లక్ష్యాలనూ వివరిస్తూ వలంటీర్లుగా పనిచేశారు. కాంగ్రెసుకు ఎన్నికల్లో అఖండవిజయం చేకూరింది.

రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. ప్రజల్లో పెద్ద సంరంభం బయలుదేరింది. ముందుగా కార్మిక వర్గంలో యిది ప్రతిబింబించింది. 1937–38 సం॥లలో 379 సమ్మెలు జరిగాయి. $6\frac{1}{2}$ లక్షలమంది కార్మికులు యీ సమ్మెల్లో పాల్గొన్నారు. జూట్ కార్మికులు, బెంగాల్–నాగపూర్ రైల్వే కార్మికులు తమ హక్కులకోసం పెద్ద ఎత్తున సమ్మెలు సాగించారు. కార్మికోద్యమంయొక్క ప్రభావం కాంగ్రెసుపై కూడ పడింది. కాంగ్రెసు అధికారంలోనున్న రాష్ట్రాలలో కొంతవరకు పౌరసత్వహక్కులు, పత్రికా స్వాతంత్ర్యం, భావ ప్రకటనా స్వాతంత్ర్యాలు ఏర్పడ్డాయి. ఉద్యమాలు కొంతవరకు పురోగమించాయి. జీతాలహెచ్చింపు, యూనియన్ గుర్తింపుల విషయంలో యు. పి. ప్రభుత్వం కాన్పూరు కార్మికుల సమ్మెను పరిష్కరించడంలో తోడ్పడింది. 1938 లో యీ నిర్ణయాలను

వ్యతిరేకించాలని యజమానులు ప్రయత్నించారు. కాని కాంగ్రెసు - కార్మికుల ఐక్యత విజయం సాధించింది.

కాని మరోప్రక్క సామ్రాజ్య పోలీసు పరిపాలనా హద్దుల్లో మెలిగే కాంగ్రెసు మంత్రివర్గాల పాత్ర త్వరలోనే కనిపించింది. అంతవరకు ఆశించిన సామాన్యమైన హక్కుల్ని సాధించడానికి, కార్మిక కర్షకులు తమ సంఘటిత ఉద్యమాల ద్వారా పూనుకుంటే, వాటిపై 'హింసను' ప్రేరేపిస్తున్నారనే పేరుతో పోలీసు బలాన్ని ప్రయోగించడం పరిపాటయింది. అప్పుడున్న పాలనకు వ్యతిరేకమైన అభిప్రాయాలున్నా, సామాన్య కోర్కెలకోసం ప్రజలు పోరాటాలు సాగించినా అదంతా 'హింసా ప్రచారము', 'హింసాచర్యల' క్రిందనే జమకట్టబడింది. త్వరత్వరగా అభివృద్ధి చెందుతున్న కార్మిక-కర్షకోద్యమాలను చూచి కాంగ్రెసులోని ఉన్నత వర్గాల, మితవాద నాయకుల భయం స్పష్టం కాజొచ్చింది.

సాంఘిక, ఆర్థిక రంగాలలో చాల పరిమితమైన కార్యక్రమాలకే కాంగ్రెసు మంత్రివర్గాలు ప్రయత్నించాయి. సామాన్యమైన ఋణ నివారణ, కౌలుతగ్గింపు మొదలైన కొద్ది సౌకర్యాలను కల్గించే చట్టాలను అమలు జరిపించాలంటేనే రైతులు పెద్దపెట్టున ఆందోళన చేయాల్సివచ్చింది. ఇక కాంగ్రెసే తన ఆశయాలుగా ప్రకటించిన పెద్ద విషయాలను సాధించాలంటే, తీవ్ర కార్యాచరణకు పూనుకోవాల్సి వుంటుందని స్పష్టమయింది. భూస్వాముల, జమీందార్ల వ్యతిరేకతను ఎదిరించలేని మంత్రుల బలహీనతవల్ల అసంతృప్తి హెచ్చింది. అది కొన్ని ప్రాంతాల్లో పోరాటరూపం ధరిం

చింది. మన మునగాల పోరాట చరిత్రే ఉదాహరణ. యు. పి. బీహార్, ఒరిస్సా రాష్ట్రాలలో కాంగ్రెసు జమీందారులతో ఒడంబడిక చేసుకొన్నది. ఈ ఒడంబడిక తీవ్ర నిరసనకు గురి అయింది.

మంత్రివర్గాలు ఆచరణలో చేసిన మేలు చాల స్వల్పం. మంత్రివర్గ నిర్మాణానుభవం, కాంగ్రెసు పదవీ స్వీకరణవల్ల కల్గిన ఆశలు ప్రోత్సాహం మూలంగా జాతీయోద్యమంలో ఆత్మవిశ్వాసము, చైతన్యము పెరిగాయి. కాని అదే సమయంలో రాజీ ధోరణిగల నాయకత్వంక్రింద సామ్రాజ్యవాదుల పాలనాయంత్రంలో తగుల్కొనడంవల్ల వున్న ప్రమాదమేమిటో యీ అనుభవంద్వారా వ్యక్తమయింది. కాంగ్రెసు సంస్థపైన, మంత్రులపైన పలుకుబడిగల మితవాద నాయకత్వం ఆచరణలో సామ్రాజ్యవాదంతో సహకరించడానికే ఎక్కువ తహతహ చూపింది. పైవర్గాల ప్రయోజనాలకు సుముఖతను ప్రకటించింది. సామాన్య ప్రజల ప్రయోజనాలు, పోరాటాలపట్ల తీవ్రమైన ద్వేషభావాన్ని వెళ్ళగ్రక్కింది. ప్రజల అసంతృప్తి పెరిగింది. కాంగ్రెసు మంత్రివర్గాలద్వారా స్వతంత్ర పోరాటం పురోగమించదనీ, తమ కోర్కెలు నెరవేరవనే భావం ప్రబలమయింది. దీనితో జాతీయోద్యమంలో నూతన సంక్షోభం బయలుదేరింది.

కాంగ్రెసు మంత్రివర్గాల కాలంలోనే కమ్యూనిస్టుపార్టీ 'నేషనల్ ఫ్రంటు' పత్రికను స్థాపించింది. కమ్యూనిస్టుపార్టీపై నిషేధం తీసివేయకపోయినా పార్టీ విధానమైన 'జాతీయైక్య సంఘటనా' ప్రచారానికి ఈ పత్రిక విశేషంగా తోడ్పడింది.

అలాగే రాష్ట్రాలలోకూడ వారపత్రికలు వెలిశాయి. ఆ రోజుల్లో ఆంధ్రరాష్ట్రంలో 'నవశక్తి' పత్రిక సామ్రాజ్య వ్యతిరేక చైతన్యాన్ని సంఘటిత పరచడానికీ, ప్రజా ఉద్యమాలను నిర్మించి నడపడానికీ ఎంతో దోహదం చేసింది. వర్గ సంఘాలు, వాటి కార్యక్రమం దినదినాభివృద్ధి చెందాయి. కొత్తపట్నం, మంతెనవారిపాలెం రాజకీయ స్కూళ్ళు ఉద్యమ నిర్మాతలను తయారుచేసి రంగంలోకి దించాయి.

ఈ ప్రయత్నాలన్నింటి ద్వారా కాంగ్రెసులోని మితవాదుల రాజీ విధానానికి వ్యతిరేకంగా అతివాద ఉద్యమం బలపడసాగింది. 1938 హరిపురా కాంగ్రెస్‌లో ఈ ప్రభావమంతా ప్రతిబింబించింది. సుభాస్‌బోస్ అధ్యక్షతక్రింద జరిగిన యీ కాంగ్రెసులో ఫెడరల్ రాజ్యాంగ చట్టాన్ని భగ్నం చేయాలని తీవ్రపదజాలంతో తీర్మానం చేయబడింది. కాని ఆచరణలోకి వచ్చేటప్పటికి మితవాద నాయకత్వం రాజీవైపే ఎదురుచూస్తూ కూర్చున్నది. సామ్రాజ్యవాదం మనపై ఈ బొనిస రాజ్యాంగ చట్టాన్ని రుద్ద పూనుకుంటే, అనుసరించవలసిన కార్యక్రమం, విధానం ఏమిటి అన్నదానికి సమాధానమేమీ లేదు. ఫెడరల్ రాజ్యాంగచట్టాన్ని భగ్నం చేయాలంటే, అశేష కార్మిక కర్షక ప్రజల్ని సమీకరించాలి. అలా సమీకరించి పోరాటమార్గంలో పెట్టడమంటే కాంగ్రెసు నాయకత్వానికి యిష్టం లేదు. సామ్రాజ్యవాదులతో క్రమంగా రాజీకి మాత్రమే సహజధోరణిలో సిద్ధమయింది.

ఈ రాజీవైఖరిని వ్యతిరేకించే శక్తుల బలం దిన దినాభివృద్ధి చెందింది. హరిపురా కాంగ్రెసులో పోటీ లేకుండా

ఎన్నుకోబడిన సుభాస్‌బోసు, గాంధీ మొదలైన అగ్రనాయకుల అభీష్టాలకు వ్యతిరేకంగా 1939 లో మరల అధ్యక్ష స్థానానికి పోటీ చేశాడు. గాంధీగారు నిలబెట్టిన పట్టాభికి 1376 ఓట్లు, బోసుకు 1575 ఓట్లు వచ్చాయి. అతివాద జాతీయవాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు అందరూ కలిసి బోసును బలపరచారు. బోసు అధ్యక్షుడయ్యాడు. కాని 1939 లో జరిగిన త్రిపురా కాంగ్రెసులో మరల వైరుధ్యాలన్నీ బయటపడ్డాయి. బోసు అధ్యక్షుడై నందున తక్కిన వర్కింగుకమిటీ సభ్యులందరు రాజీనామా నిచ్చారు. గాంధీగారికి మరల సర్వాధికారాలు యీ కాంగ్రెసులో యివ్వబడ్డాయి. బోసు, గాంధీల మధ్య ఏకాభిప్రాయం రానందున బోసు రాజీనామా నిచ్చాడు. అఖిలభారత కాంగ్రెసుకమిటీ రాజేంద్రప్రసాదును అధ్యక్షునిగా నియమించింది. ఇదే సమావేశంలో కాంగ్రెసు నిబంధనావళిలో కొన్నిమార్పులు చేయబడ్డాయి. ఎ. ఐ. సి. సి. అనుమతి లేకుండా ఏ కాంగ్రెసువాదీ ఏ ప్రజా పోరాటంలోను పాల్గొనడంగాని, ఏ సత్యాగ్రహాన్ని సాగించడంగాని చేయకూడదని తీర్మానించింది. ఇది అభివృద్ధిచెందుతున్న కార్మిక-కర్షక పోరాటాలను అరికట్టడానికి ఉద్దేశించి చేయబడిందే. ప్రతిపక్ష వర్గాల వారందరూ ఏకమై అతివాద సంఘటనగా ఏర్పడి, బోసుతో సహా ఇందుకు అసమ్మతి తెల్పుతూ బహిరంగ సభలు జరపాలని తీర్మానించారు. ఇలా చేయడం కాంగ్రెసు క్రమశిక్షణకు విరుద్ధమని కాంగ్రెసు నాయకత్వం తీర్మానించింది. బోసును బెంగాలు కాంగ్రెసు అధ్యక్ష పదవినుండి కూడ తొలగించారు. ఈవిధంగా

యుద్ధ ప్రారంభంనాటికి కాంగ్రెసులో అంతర్గత సంక్షోభం తీవ్రమయింది.

యుద్ధ ప్రారంభం ముందున్న పరిస్థితులను క్లుప్తంగా యిలా సమీక్షించవచ్చు. 1934-'37 వరకు జాతీయైక్య సంఘటనా ఉద్యమం త్వరితగతిని పురోగమించింది. నెహ్రూ మొదలు కమ్యూనిస్టు వరకు ఒకే నినాదంతో పనిచేశారు. ఈ దశలో కమ్యూనిస్టులు నిర్మించ బూనుకొన్న సామ్రాజ్య వ్యతిరేక జాతీయైక్యసంఘటన బలపడింది. ఫాసిజాన్ని వ్యతిరేకిస్తూ ప్రపంచ ప్రజల సంఘటనలోకూడ భాగస్వాములమని కాంగ్రెసు తీర్మానించింది. వర్గసంఘాల ఉనికిని కాంగ్రెసు గుర్తించింది. ఉద్యమాలు బలపడడానికి దోహదం చేసింది. మితవాద నాయకులుకూడ యీ దశలో యీ బలాన్నంతనీ తమ కనుకూలంగా వినియోగించుకోవచ్చు ననుకొన్నారు. అందుచేత ఆటంకం కల్గించ లేదు. కల్గించలేకపోయారు కూడాను.

అయితే మంత్రివర్గా లేర్పడ్డ తర్వాత మితవాద నాయకుల విచ్ఛిన్నపాత్ర ప్రారంభమయింది. రాజ్యాంగ చట్టాన్ని భగ్నం చేయడానికి బదులు, సామ్రాజ్యవాదులతో రాజీపడి తమ అధికారాలను కాపాడుకోవాలను కొన్నారు. ప్రజాహక్కుల్ని మన్నించి, ప్రజాఉద్యమాలను బలపరచడానికి బదులు తమ పెత్తనం పోతుందేమోనని ఉద్యమాలను అణచడానికి అధికారాల నుపయోగించారు. జాతీయైక్య సంఘటన బలపడినకొద్దీ, అతివాదుల పలుకుబడి – ముఖ్యంగా కమ్యూనిస్టుల నాయకత్వం బలపడుతోందని గ్రహించారు. ఈ విధంగా జాతీయైక్య సంఘటనా ఉద్యమంలో అతివాదులు, మితవాదుల

మధ్య స్పర్థ లేర్పడ్డాయి. హరిపుర, త్రిపురీ కాంగ్రెసులలో అతి వాదుల పలుకుబడి హెచ్చిందని స్పష్టమయింది. కాని అతి వాదులమధ్య ఐక్యత ఏర్పడనందున, అందుకొరకు తీవ్రంగా కృషిచేసిన కమ్యూనిస్టుపార్టీ శక్తి యింకా చాలనందున మిత వాదుల విచ్ఛిన్న ప్రయత్నాలు జయంపొందాయి. క్రమశిక్షణ పేరుతో అతివాదులను కాంగ్రెసునుండి తరిమివేసి ఐక్యసంఘట నను విచ్ఛిన్నంచేసే ప్రయత్నాలపై మితవాదులు తమ దృష్టిని కేంద్రీకరించారు.

# 1939 రెండవ ప్రపంచ యుద్ధము-జాతీయోద్యమం

యుద్ధం ప్రారంభంకావడంతో పరిస్థితు లన్నివిధాలా మార్పు చెందాయి. వ్యక్తులకు, పార్టీలకు, రాజకీయ నినాదా లకు పరీక్షా సమయం వచ్చింది.

అదివరకే సామ్రాజ్యవాద దోపిడీకి గురియవుతున్న మన దేశాన్ని, ప్రజల్ని యుద్ధాన్ని కొనసాగించడానికి బ్రిటిష్ పాలకులు మరింత ఎక్కువగా దోచుకోవలసిన స్థితి ఏర్ప డింది. అందుచేత బ్రిటిష్ సామ్రాజ్యవాదానికీ, యావద్భా రత జాతికీ వైరుధ్యం మరింత తీవ్రమయింది. యుద్ధం ప్రారంభం కాగానే ఆర్డినెన్సుల రాజ్యం ప్రారంభమయింది. కాంగ్రెసు నాయకత్వపు రాజీ సంప్రతింపులు విఫలం చెందడంతో మం త్రులు పదవులనుంచి విరమించారు. గవర్నరు సలహాదారుల పరిపాలన ఏర్పడింది. ఇండియా బడ్జెటు యుద్ధ బడ్జెటుగా

మారింది. ఈ విధంగా ఇండియా మొదటి ప్రపంచ యుద్ధంలో మాదిరిగానే యుద్ధ ప్రకటన జరిగిన కొన్ని గంటలలోనే యుద్ధంలోకి యీడ్చబడింది.

ప్రభుత్వం యుద్ధం కొనసాగించడానికి భారత దేశంలో అవలంబించిన ఆర్థిక రాజకీయ విధానాలతో అన్ని తరగతుల ప్రజలనుండి పూర్తిగా వేరుపడిపోయింది. మన స్వతంత్ర పోరాటాన్ని జయప్రదంగా కొనసాగించడానికి పూర్తి అనుకూల పరిస్థితులేర్పడ్డాయి. కాని కాంగ్రెసు నాయకత్వం దేశవ్యాపిత ప్రజా పోరాటాన్ని తీసుకురావడానికి నిరాకరించింది. ఎందుచేత? యుద్ధ సమయంలో ప్రజా పోరాటాలను ప్రారంభిస్తే అది బూర్జువా సంస్కరణవాదుల హద్దులను తుడిచిపెట్టి విప్లవ పోరాటంగా మారుతుంది. కార్మిక కర్షక ఉద్యమాలు బలపడి జాతీయ ఉద్యమంపై వాటి పలుకుబడి హెచ్చి తమ పలుకుబడి క్షీణిస్తుంది. ప్రజా ఉద్యమమంటే అందుకే భయం. జాతి మొత్తం లాభాలకంటే తనవర్గ లాభాలను ప్రధానంగా చూచుకొంటుంది బూర్జువావర్గం. తనపలుకుబడి, పట్టు వుద్యమంపై సడలిపోయే పరిస్థితిలో సామ్రాజ్యవాదంతో ఏదోవిధంగా రాజీచేసుకొని లొంగిపోవడానికి చూస్తుంది.

అందుచేతనే కాంగ్రెసు నాయకత్వం ప్రజా పోరాటాన్ని తీసుకురాకుండా ప్రభుత్వంవైపు రాజీకోసం నిరీక్షిస్తూకూర్చుంది. కాని ప్రభుత్వం కాంగ్రెసు నాయకత్వపు రాజీహస్తాన్ని కూడా త్రోసిపుచ్చింది. 1940 సెప్టెంబరులో పూనాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సమావేశంలో జాతీయ ప్రభుత్వాన్ని నెలకొల్పితే ప్రభుత్వంతో సహకరిస్తామని తీర్మానించింది. కాని

ప్రభుత్వం నిరాకరించింది. అయినా పోరాటం ప్రారంభించడానికి కాంగ్రెసు నాయకత్వం సిద్ధపడలేదు. ప్రభుత్వంతో రాజీపడడానికి మరొక మార్గంగా మాత్రమే వ్యక్తిగత సత్యాగ్రహానికి పూనుకొన్నది. ప్రభుత్వం యీ వ్యక్తిగత సత్యాగ్రహాన్ని ఒకఫార్సుగా మాత్రమే చూచింది. దానిలో అంతర్గతమైయున్న రాజీకోసం ప్రాకులాటను ప్రభుత్వం అర్థం చేసుకొన్నది. ఈవిధంగా జాతీయోద్యమం ఏకోన్ముఖంగా ముందుకు ఎప్పుడు సాగలేదో కాంగ్రెసు నాయకత్వపు యీ బలహీన చర్యవల్ల ప్రజాబాహుళ్యం పాల్గొనే సమిష్టిపోరాటం సాగించాలనే తీవ్రవాదులపై దాడిచేసి దెబ్బతీయడానికి ప్రభుత్వానికి అవకాశం చిక్కింది.

జాతీయోద్యమానికి నాయకత్వం వహిస్తున్న బూర్జువా వర్గం యిలా పోరాట వ్యతిరేక పాత్రను వహించినపుడు జాతీయోద్యమాన్ని ముందుకు తీసుకుపోవలసిన కర్తవ్యం అతివాదులపైనా సోషలిస్టులు, కమ్యూనిస్టులు మొదలైన వారందరిపైనా బడింది. ఈ బాధ్యతను నిర్వహించడంలో ఆనాటికి అతివాదపార్టీలుగానున్న సోషలిస్టుపార్టీ, ఫార్వర్డుబ్లాకు, కమ్యూనిస్టు పార్టీలు ఎలాంటిపాత్ర వహించాయో చూదాం.

కాంగ్రెస్, సోషలిస్టుపార్టీ:— యుద్ధానికి ముందే సోషలిస్టులకు, కమ్యూనిస్టులకు కొంతవరకు భేదాభిప్రాయాలు వచ్చాయి. యుద్ధం వచ్చాక సోషలిస్టు రాజకీయాల యొక్క నగ్నరూపం బయటపడింది. కమ్యూనిస్టులను, వారి కార్యక్రమాన్ని తిడుతూ గాంధీగారి సిద్ధాంతాలతో ఏకీభవిస్తూ ప్రచారాన్ని సాగించారు. యూరప్ సోషల్ డెమోక్రాట్ల

వలనే సోవియట్-జర్మన్ నిరాక్రమణ ఒడంబడికను ద్వేషిస్తూ సోవియట్‌ను విరోధ భావంతో చూచారు. సోవియట్ చేసిన ప్రతి చర్యను గురించి సామ్రాజ్యవాదుల విషప్రచారానికి వంత పాడారు. వారి 'సోషలిజం' సోవియట్ దేశాన్ని అర్థం చేసుకో లేకపోయింది. పైపెచ్చు సోవియట్‌పై యుద్ధానికి సన్నాహం చేస్తూ, ప్రపంచ బూర్జువా పత్రికలు చేసే దుష్ప్రచారాన్నీ, నింద లను వారుకూడ ప్రచారం చేశారు.

జాతీయోద్యమానికి సంబంధించినంతవరకు యుద్ధం రాగానే తమ పార్టీ నాయకత్వాన సోషలిస్టులు సత్యాగ్రహం జరపాలనుకున్నారు. తరువాత గాంధీ నాయకత్వంకోసం ఎదురు చూచారు.

ఈ విధంగా సోషలిస్టులు బూర్జువావర్గ నాయకత్వాన్ని అనుసరిస్తూ కమ్యూనిస్టులను నిందించడమే పనిగా పెట్టుకున్నారు. సోషలిస్టు ఐక్యతను విచ్ఛిన్నం గావించారు.

ఫార్వర్డుబ్లాకు :— బోసు ఫార్వర్డుబ్లాకును ఏర్పరచ టానికి పూనుకున్నపుడు, అది కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ సంస్థగా తయారవుతుందనియు, జాతీయైక్య సంఘటనను విచ్ఛిన్నం గావిస్తుందనియు కమ్యూనిస్టులు హెచ్చరించారు.

ఆచరణలో ఫార్వర్డుబ్లాకు నాయకత్వానికి, కాంగ్రెసు నాయకత్వానికి తేడా లేకుండాపోయింది. వీరు జాతీయపోరాట నినాదాన్ని, కేవలం కాంగ్రెసు నాయకత్వాన్ని, వర్కింగు కమిటీని విమర్శించడానికి మాత్రమే వినియోగించారు. యుద్ధం వచ్చాక యిది మరింత స్పష్టమయింది. బెంగాలులో ఫజ్లుల్ హక్ ప్రభుత్వం క్రూరమైన నిర్బంధ పాలన సాగిస్తున్నప్పుడు

పౌరసత్వ హక్కులకోసం బెంగాలులో పోరాటం తీసుకురావలసిందనీ, దానికి తాము పూర్తిగా సహకరిస్తామనీ కమ్యూనిస్టులు బోసును కోరారు. బెంగాలు కాంగ్రెసు నాయకత్వాన బోసు ఆ పోరాటమే ప్రారంభించి వున్నట్లయితే, జాతీయపోరాటాన్ని ముందుకు తీసుకుపోయేవి. పోరాట శక్తులు బలపడి కాంగ్రెసు నాయకత్వాన్ని లాంగదీసుకు వచ్చుటో, లేక ప్రజలపైనా, జాతీయోద్యమంపైనా, వారికున్న పలుకుబడి తొలగిపోవుటో జరిగివుండేది. కాని బోసు అలాంటిదేమీ చేయలేదు. గాంధీ-బోసు లిద్దరు వేరు వేరు నినాదాల క్రింద, వేరు వేరు పంథాల ద్వారా జాతీయ పోరాట వ్యతిరేక కార్యక్రమాన్ని మాత్రమే అనుసరించారు.

కమ్యూనిస్టుపార్టీ :— యుద్ధం ప్రారంభంకాగానే యుద్ధంపట్ల కమ్యూనిస్టుపార్టీ నైఖరి 'నేషనల్ ఫ్రంటు' పత్రికద్వారా స్పష్టం చేయబడింది. పత్రిక వెంటనే నిషేధించబడింది. భారత ప్రజలందరూ యుద్ధాన్ని వ్యతిరేకించి, అవకాశాలనన్నింటినీ ఉపయోగించుకొని స్వాతంత్ర్యాన్ని సాధించాలని విజ్ఞప్తి చేసింది. ప్రజల్ని విప్లవోన్ముఖుల్ని చేయడానికి కార్మిక కర్షక ప్రజా పోరాటాల నభివృద్ధి చేయాలని హెచ్చరించింది. కార్మికవర్గం చొరవ తీసుకొని ప్రజల్ని ఉత్తేజపరచడానికి, సమీకరించడానికి యుద్ధ వ్యతిరేక రాజకీయ ప్రదర్శనాలు, ప్రొటెస్టు సమ్మెలు గావించాలని విజ్ఞప్తి చేసింది. ప్రజా పోరాటాలద్వారా జాతీయ సంఘటనలోనున్న బూర్జువా వర్గంయొక్క పోరాట వ్యతిరేక పంథాను ఓడించవచ్చునని స్పష్టం చేసింది. ఈ క్రమంద్వారా జాతీయైక్య

సంఘటనా ఉద్యమాన్ని పెంపొందిస్తూ, సంపూర్ణ స్వాతం
త్ర్యాన్ని సాధించగలమని చాటి చెప్పింది. ఇదీ కమ్యూనిస్టు
పార్టీ చూపిన కార్మికవర్గ పంథా.

ఈ విధంగా కమ్యూనిస్టుపార్టీ యిటు జాతీయ బూర్జువా
రాజీ పంథాను ఓడించడానికీ, అటు అతివాద జాతీయశక్తుల
ఐక్య సంఘటనా విచ్ఛిన్న చర్యల నరికట్టడానికీ తగిన పంథాతో
స్వతంత్రశక్తిగా పనిచేయడం ప్రారంభించింది.

కమ్యూనిస్టుపార్టీ యిచ్చిన యుద్ధ వ్యతిరేక పిలుపును
కార్మికవర్గం వెంటనే అందుకొన్నది. బొంబాయిలో 90 వేల
మంది కార్మికులు సమ్మెచేసి, యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలు జరి
పారు (అక్టోబరు 2 న). మార్చి 5 వ తేదీన ప్రజలపై పడు
తున్న యుద్ధభారాలను నిరసిస్తూనూ, తమకు అధికధరల అల
వెన్సును డిమాండుచేస్తూనూ, బొంబాయి కార్మికులు 1 లక్ష
75 వేలమంది సమ్మెచేశారు. మార్చి 10 వ తేదీన అఖిల
భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు పిలుపు నందుకొని
3½ లక్షలమంది కార్మికులు ఒకరోజు సమ్మెచేశారు.

అదేవిధంగా దేశమంతటా వర్గ సంఘాలద్వారా తమ
హక్కులకోసం పాక్షిక పోరాటాలు ప్రారంభమైనాయి.

కాంగ్రెసు నాయకత్వం నీరుగారి కూర్చున్నది; ప్రభుత్వం
అతివాదులపై తన దాడిని కేంద్రీకరించింది. నేషనల్ ఫ్రంటు,
క్రాంతి, నవశక్తి మొదలైన పత్రికల నన్నింటిని నిషేధించింది.
దొరికినవారినెల్లా అరెస్టుచేసింది.



# యుద్ధస్వభావంలో మార్పు - 1942 ఆగస్టు తీర్మానం - ఉద్యమ పోకడ

సామ్రాజ్యవాదుల మధ్య యుద్ధం జరుగుతున్న సమయంలో అవకాశాన్నుపయోగించుకొని, బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక చైతన్యాన్నంతనీ సంఘటితపరచి యుద్ధానికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించడంలో జాతీయోద్యమం విఫలమయింది. కాంగ్రెసు నాయకత్వం, తదితర పార్టీలు ఏవిధంగా బోల్తాలుకొట్టాయో పైన చూచాము. కాంగ్రెసు సాగించిన నామకః సత్యాగ్రహం సామ్రాజ్యవాదులు నిర్బంధాల నుపయోగించి అతివాదు లందరిని అరెస్టుల గావించడానికి ఎలా ఆయుధంగా ఉపయోగపడిందీ కూడ పైన చూపాము.

ఇంతలో యుద్ధ స్వభావంలోనే మార్పువచ్చింది. 1941 జూన్ 22వ తేదీన నిరాక్రమణ ఒడంబడిక నుల్లంఘించి హిట్లరు సోవియట్ యూనియనుపై దాడి చేశాడు. సామ్రాజ్యవాదులు తమ మధ్య ప్రపంచాన్ని పంచుకునేందుకు జరుపుతూవచ్చిన యుద్ధ స్వభావం మారింది. సోవియట్ యూనియన్‌యొక్క భవిష్యత్తును, ప్రపంచ సోషలిస్టు ఉద్యమంయొక్క భవిష్యత్తును నిర్ణయించే యుద్ధంగా మారింది. ఈ పరిస్థితులలో ప్రపంచ ప్రజల ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంతో జోడించి, మన స్వాతంత్ర్యోద్యమాన్ని ఎలా ముందుకు తీసుకుపోవాలి అన్న క్లిష్టసమస్య మన జాతీయోద్యమాన్ని ఎదుర్కొన్నది. ఫాసిస్టు కూటమికి వ్యతిరేకంగా సోవియట్ యూనియన్, చైనా, అమెరికాలతో బాటు, మన దేశాన్ని బానిసత్వంలో ఉంచిన

బ్రిటిష్ సామ్రాజ్యవాదులుకూడ మిత్రమండలిలో చేరడంతో మనపని మరింత క్లిష్టతరమైనది. అదే సమయంలో మన జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించడానికి ప్రపంచ ప్రజలందరి సానుభూతి, అండ పరిపూర్ణంగా లభ్యమయ్యే అవకాశం కూడ, మన ముందుకు వచ్చింది. ఇలాంటి క్లిష్ట సమయంలో జాతీయోద్యమాన్ని ఏకోన్ముఖం చేసి, ముందుకు గొంపోవలసిన వివిధ పార్టీలు ఏ ఏ వైఖరు లవలంబించాయో, వాటి పర్యావసాన మేమైనదో పరిశీలించాల్సివుంది.

కాంగ్రెసు :— సామ్రాజ్యవాద యుద్ధకాలంలో ఖచ్చితమైన యుద్ధవ్యతిరేకవైఖరి తీసుకోకుండా, అందుకోసం ప్రజల్ని సమీకరించకుండా చిహ్నప్రాయంగా సత్యాగ్రహం సాగిస్తూ రాజీకోసం ప్రాకులాడింది కాంగ్రెసు నాయకత్వం.

ఇక యుద్ధ స్వభావంలో మార్పు వచ్చాక నెహ్రూ, అజాద్ మొదలైన కొంతమంది నాయకులుమాత్రం మాటల్లో యీ మార్పును అంగీకరించారు. అందు కనుగుణ్యంగా కాంగ్రెసులో తీర్మానాలు చేయబడ్డాయి. కాని కాంగ్రెసు నాయకత్వంలో అధిక సంఖ్యాకులు గాంధీగారి నాయకత్వాన శాంతి సూత్రాలు (పాసిఫిస్టు) వల్లిస్తూ కూర్చున్నారు. బ్రిటిషు ప్రభుత్వం రాజీకి దిగివచ్చి కేంద్రంలో కొన్ని పరిమితుల్లోనైనా అధికారం యివ్వడానికి సిద్ధపడలేదు. కాబట్టి గాంధీగారు నాల్గు సూత్రాలను ప్రచారంలో పెట్టారు. 1. జపానును అహింసతో నిరోధించాలి. 2. బ్రిటిష్ అధికారులతో సహాయ నిరాకరణ చేయాలి. 3. మిత్రరాజ్య సమితిపట్ల నైతిక సానుభూతిచూపాలి. 4. తగాదాలో ఇండియా తగుల్కొనకుండా వేరుగా వుండాలి.

మొదట్లో కాంగ్రెసు ఈ సూత్రాలకు అంగీకరించలేదు. క్రిప్సు రాయబారం విఫలమైన తర్వాత నెహ్రూ, అజాద్, గాంధీగారలు కలిసి చర్చించి ఒక అంగీకారానికి వచ్చారు. దీని ఫలితంగా 1942 జులై 14 న కాంగ్రెసు వర్కింగు కమిటీ సహాయ నిరాకరణ తీర్మానాన్ని తయారుచేసింది. ఈ తీర్మానమే తర్వాత పరస్పర వైరుధ్యాలతో కూడిన అగస్టు తీర్మానంగా రూపొందింది.

ఈ తీర్మానం మిత్రరాజ్యసమితి ఎడల సానుభూతి చూపింది; మిత్రరాజ్యాల సహకారంతో ఫాసిజంపై సాయుధ ప్రతిఘటన సాగించేందుకు; జాతీయ ప్రభుత్వంక్రింద భారత దేశాన్ని స్వతంత్ర మిత్రరాజ్యంగా గుర్తించాలనీ వాంఛించింది. కాని తీర్మానంలోని ఆఖరు భాగంలో జాతీయవాంఛ నిరాకరించబడితే 'అతి విశాలమైన ప్రజా పోరాటాన్ని ప్రారంభించాలని' హెచ్చరించింది.

సంప్రతింపులకోసం బెదరింపుగా మాత్రమే పోరాటం ఆరంభిస్తామన్నామని తర్వాత నాయకుల ప్రకటనలవల్ల తేలింది. కాని యీ తీర్మానం ఫలితంగా ఒకవైపున ప్రభుత్వం అవకాశం తీసుకొని నాయకులను నిర్బంధించడంద్వారా దెబ్బకొట్టింది. మరోవైపున ప్రజల్లో బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక మనస్తత్వం ఒక్కసారిగా చెలరేగి ప్రఖ్యాతిచెందిన అగస్టు ఉద్యమ ఘటనల రూపం దాల్చింది.

కాంగ్రెసు నాయకత్వానికి ప్రపంచ ప్రజల సహకారంతోనూ, మన ప్రజలను సమైక్యంచేసే, ప్రజా ఉద్యమ బలంతోనూ బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ఓడిద్దామనే దృష్టిగాని,

ఓడించగలమనే విశ్వాసంగాని లేదు. బెదరించి రాజీ పడదా మనే నైఖరే తీసుకొన్నది. సామ్రాజ్య యుద్ధకాలంలో బేషరతుగాకూడ సహకరిస్తామని ప్రకటించిన గాంధీగారు, ఆనాడు అసాధ్యమని తలచిన ప్రతిఘటనోద్యమాన్ని ఒక వైపున మిత్రరాజ్య సమితిపట్ల సానుభూతిని ప్రకటిస్తూనే ప్రారంభించేందుకు సమయం ఆసన్నమయిందని తీర్మానింప జేశాడంటే కాంగ్రెసు నాయకత్వంయొక్క దివాళాకోరు తనము, వర్గ స్వభావము స్పష్టంగా బోధపడుతుంది. జాతీ యోద్యమానికి నాయకత్వం వహించే పాత్ర కోల్పోయిందని అర్థమవుతుంది.

ముస్లిం లీగు :- 1922 ఉద్యమ విరమణతో అసంతృప్తి జెంది కాంగ్రెసునుండి విడిపోయిన ముస్లింలీగు క్రమంగా స్వాతంత్ర్యోద్యమానికి మరింత దూరమవుతూ వచ్చింది. చీలించి పాలించే బ్రిటిషు సామ్రాజ్యవాదులు చూపే ప్రత్యేక సౌక ర్యాల ఆశలు మరింత దూరంచేశాయి. కాంగ్రెసు నాయకత్వం లోని హిందూమత తత్వధోరణి (ముఖ్యంగా గాంధీగారి) అటు నుండి ముస్లిం ప్రజల్లో మత తత్వాన్ని రెచ్చగొట్టేవారికి తోడ్పడింది. దానికితోడు కాంగ్రెసు ముస్లిం ప్రజాసామాన్యంతో సంబంధం పెట్టుకొని కార్మిక కర్షక ఉద్యమాల ద్వారా ఆకర్షించే నైఖరిని తీసుకోలేక పోయింది. వీటన్నిటి ఫలితంగా ముస్లింలీగు నాయకత్వం పాకిస్తాన్ నినాదంతో ముస్లిం ప్రజ లందరినీ ఆకర్షించి 1939 నాటికి ముస్లిం ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులకు నాయకత్వం వహించే స్థితికి వచ్చింది. లీగు నాయకత్వం ప్రత్యేకించి కాంగ్రెసు వ్యతిరేకనైఖరి తీసుకొన్నది.

ఇలా ముస్లిం ప్రజల్లో బలం సంపాదించిన లీగు నాయకత్వం యుద్ధం ప్రారంభమైనప్పటినుండి కాంగ్రెసు నాయకత్వం అవలంబించిన నైఖరే అవలంబిస్తూ వచ్చింది. కాంగ్రెసు సత్యాగ్రహం ద్వారా బెదరించి రాజీపడదామని చూస్తే, ముస్లింలీగు – ప్రభుత్వము, కాంగ్రెసు – కలిసి తనకు పాకిస్తాన్‌ను ప్రసాదించుట కిష్టపడితే సహకరిస్తానంటూ హఠం చేసింది. కాంగ్రెసు లీగులకు మధ్య వచ్చిన యీ నైరుధ్యాన్ని మరింత పెంచి సామ్రాజ్యవాదులు చక్కగా వినియోగించు కొన్నారు.

రాయిస్టులు :– సామ్రాజ్యవాద యుద్ధకాలంలోనే రాయిస్టులు ఫాసిస్టు వ్యతిరేక యుద్ధమనే పేరుతో సామ్రాజ్య వాదులతో సహకరించారు. కాంగ్రెసు సంస్థను ఫాసిస్టు సంస్థగా చిత్రించి (ఇంకా జాతీయోద్యమంలో దానిపాత్ర వుండగానే) బ్రిటిషు ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని పూర్తిగా సమర్థించారు. అటు తర్వాత కూడ యుద్ధాన్ని గెలవడానికి, దేశాన్ని ఫాసిస్టు ప్రమాదాన్నుండి రక్షించడానికీ ప్రజా సమీకరణయొక్క అవసరాన్నిగాని, జాతీయ ప్రభుత్వంయొక్క అవసరాన్నిగాని రాయిస్టులు గుర్తించలేదు. సామ్రాజ్య వాదులతో మిళితమై పోవడమే రాయిస్టు పంథాగా తయారయింది.

ఫార్వర్డుబ్లాకు :– 'బ్రిటను శత్రువు భారతదేశానికి మిత్రుడు' అనే సూత్రంమీద పనిచేశారు. జపాను బ్రిటిష్ ప్రభుత్వానికి శత్రువుకాబట్టి, జపాను అండతీసుకొని స్వాతంత్ర్యం సంపాదించాలన్నారు. అగస్టు ఘటనలలో చెలరేగిన బ్రిటిష్

వ్యతిరేక మనస్తత్వాన్ని తమ ప్రచారానికి అనుకూలంగా విని యోగించుకొన్నారు.

కాంగ్రెసు సోషలిస్టులు:- సామ్రాజ్యవాద యుద్ధకాలంలో మాటల్లో యుద్ధ వ్యతిరేక నైఖరి కనబరిచారు. ఆచరణలో కాంగ్రెసు నాయకత్వపు అడుగుజాడల్లో నడిచారు. గాంధీజమ్ సోషలిజానికి శరణ్యమన్నారు. సోవియట్ యూనియన్‌పై దుమ్మెత్తిపోశారు. ఇక యుద్ధ స్వభావంలో మార్పు వచ్చిన తర్వాతనే, వీరి యుద్ధ వ్యతిరేక నైఖరిలో తీవ్రత హెచ్చింది. కాంగ్రెసు పోరాటం తీసుకురావాలని ఒత్తిడి చేశారు. కాంగ్రెసు నాయకుల అరెస్టు అనంతరం అగస్టు ఉద్యమ ఘటనలను ఫార్వర్డుబ్లాకుతో కలిసి నాయకత్వం వహించి నడిపారు. స్వతంత్ర కార్మిక పంథాకు, సోషలిజానికి, అంతర్జాతీయతకు స్వస్తి చెప్పారు. యుద్ధంపట్ల వీరి నైఖరి యిది: భారత దేశం పైకి జపాను సేనలు వస్తేనే స్వాతంత్ర్యం వస్తుంది. ప్రతిష్టంభన కొనసాగుతూ వుండాలి. జర్మనీకి, సోవియట్ యూనియన్‌కు; చైనాకు, జపానుకు సంధి కుదరాలి. ఫాసిస్టులు బ్రిటిష్ అమెరికన్ సైన్యాలను ఓడించాలి. అప్పుడు మనకు స్వాతంత్ర్యం వస్తుంది.

కమ్యూనిస్టుపార్టీ :- సామ్రాజ్యవాద యుద్ధ కాలంలో కమ్యూనిస్టుపార్టీ అప్పటికింకా శైశవావస్థలోనే వున్నప్పటికీ, యుద్ధానికి వ్యతిరేకంగా ఖచ్చితమైన నైఖరి తీసుకొన్నది. సామ్రాజ్య వ్యతిరేక ప్రజా చైతన్యాన్ని సంఘటిత పరచడానికి పూనుకొన్నది. అతివాదు లందర్నీ ఆకర్షించి నాయకపాత్ర వహించింది.

యుద్ధ స్వభావంలో మార్పు వచ్చాక, ఆసుమాసాల పాటు ప్రపంచ పరిస్థితుల్లో వచ్చిన మార్పును గుర్తించలేక పోయింది. జాతీయ మనస్తత్వంలో కొట్టుకుపోయి, అంతర్జాతీయ దృక్పథంతో వ్యవహరించలేకపోయింది. అయితే ఆ వెనువెంటనే మేల్కొని నూతన పరిస్థితుల్లో జాతీయోద్యమాన్ని ముందుకు తీసుకుపోయే స్వతంత్ర నైఖరిని, కార్యక్రమాన్ని చేపట్టింది. ఆ నైఖరి యిది: "మన జాతీయ స్వతంత్రంకోసం జరిగే పోరాటాన్ని ఒంటరిగాగాక, నూతన పరిస్థితుల్లో ప్రపంచ ప్రజలంతా ఏకమై సాగిస్తూన్న ఫాసిస్టు వ్యతిరేక పోరాటంతో జోడించి సాగించాలి. మన ప్రజల్ని, ప్రజలపై పలుకుబడిగల పార్టీలను ఏకంజేసి, మనపై పెత్తనం చెలాయిస్తున్న బ్రిటిష్ సామ్రాజ్య వాదుల్ని లొంగదీసుకు వచ్చి జాతీయ ప్రభుత్వం సాధించాలి. ఈ యుద్ధాన్ని మన ప్రజా యుద్ధంగా సాగించి, దేశాన్ని ఫాసిజాన్నుండి రక్షించి మన స్వాతంత్ర్యాన్ని సాధించాలి. ఇదీ పార్టీ యిచ్చిన పంథాయొక్క సారాంశం.

అయితే యీ నైఖరి జాతీయంగా అనేక క్లిష్ట సమస్యల నెదుర్కోవలసి వచ్చింది. అంతవరకు జాతీయోద్యమం ద్వారా ప్రజల్లో పెంపొందుతూ వచ్చిన బ్రిటిష్ వ్యతిరేక మనస్తత్వానికి, మిత్రమండలిలోనున్న బ్రిటనుతో కలసి పోరాడమంటే ఎంత విముఖత వుంటుందో చెప్ప నవసరంలేదు. దానికితోడు ప్రజల్ని సమీకరించే పాత్ర వదలివేసి కాంగ్రెసుతోసహా యితర పార్టీలన్నీ యీ మన స్తత్వాన్ని తమ తప్పుడు దృక్పథాలకు అనుకూలంగా రెచ్చ గొట్టాయి. దీనితో బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో యింతవరకూ

రాజీ లేకుండా పోరాడుతూవచ్చిన కమ్యూనిస్టులు రాజీ వాదులుగా కనబడ్డారు. ఎప్పుడూ రాజీకోసమే ప్రాకులాడుతూ వచ్చిన మితవాద కాంగ్రెసు నాయకులు పోరాటవాదులుగా ప్రదర్శనం చేయసాగారు. కమ్యూనిస్టువ్యతిరేకత మితవాదుల్లోనే కాక, అతివాదుల్లో మరింత ప్రబలిపోయింది. కమ్యూనిస్టులు బ్రిటిష్‌వాళ్ళ ఏజంట్లుగా తయారయ్యారని మనస్ఫూర్తిగా నమ్మే దేశభక్తు లనేకమంది తయారయ్యారు.

రాజకీయ పరిస్థితిని మరింత అధ్వాన్నం చేసిన మరొక జటిల సమస్య ఆనాడెదురౌతున్నది. ముస్లింలీగ్ ముస్లిం ప్రజలందరినీ వెనుకవేసుకొని, ఒక బలమైన శక్తిగా, కాంగ్రెసుకు వ్యతిరేకంగా తయారయింది. కాంగ్రెసుకు వ్యతిరేకంగా ఎవరు ఎదురు వచ్చినా, కాంగ్రెసు వాదుల్లోను, కమ్యూనిస్టు వ్యతిరేక అతివాదుల్లోను అది వచ్చి అభివృద్ధి నిరోధక శక్తిగా చూడబడేది. అందుచేత ముస్లింలీగు నాయకత్వాన్నేగాక, ముస్లిం ప్రజలందరినీకూడ అభివృద్ధి నిరోధకులుగా చూచే ధోరణి ప్రబలంగా వుంది. ఈ ధోరణి సరిఅయింది కాదనీ, ముస్లిం ప్రజల్ని దృష్టిలో పెట్టుకొని కాంగ్రెసు లీగులు కలవాలనీ కమ్యూనిస్టుపార్టీ నినాద మిచ్చింది. సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమంలో కమ్యూనిస్టుల ఎడ ద్వేషం పెరగటానికి యిదొక ముఖ్య కారణం.

వీటితోబాటు కార్మికసంఘాలు, తదితర సంఘాలన్నింటిలోను చీలిక వచ్చింది. పోటీ సంఘా లేర్పడ్డాయి.

ఇలాంటి క్లిష్ట సమస్యల మధ్య ప్రవాహాని కంతటికీ కమ్యూనిస్టుపార్టీ ఎదురీదాల్సివచ్చింది. ఈ పరిస్థితుల

మధ్యనే ప్రజల్ని సమీకరించాలి. జాతీయోద్యమాన్ని ఏకం చేయాలి. భారత కార్మికవర్గంయొక్క సామ్రాజ్య వ్యతిరేక జాతీయ కర్తవ్యాలను, అంతర్జాతీయ కార్మికవర్గ కర్తవ్యాలతో జోడించాలి. జాతీయోద్యమంలో ప్రవేశించిన ఫాసిస్టు అనుకూల నైఖరిని ఖండిస్తూనే అటునైపు ఆకర్షించబడిన అసంఖ్యాకులైన సామ్రాజ్యవాద వ్యతిరేకుల్ని కూడగట్టుకురావాలి. ముస్లిం ప్రజలమధ్య, ముస్లిమేతర ప్రజలమధ్య పనిచేస్తూ కాంగ్రెసు లీగు నాయకులిరువురూ ప్రజాస్వామిక వ్యతిరేక నైఖరి వహిస్తున్నారని నిరూపించాలి. అన్నిటికంటె ముఖ్యంగా ప్రజల హక్కులకోసం పోరాడుతూ, ప్రజాసంఘాల్ని ఐక్యం చేయాలి.

ఈ జటిల సమస్యల నన్నింటినీ జయప్రదంగా ఎదుర్కొని నిర్వహించాలంటే, కమ్యూనిస్టుపార్టీకి ఎంతో పరిపక్వత కావాలి. అలాంటి పరిపక్వతను పార్టీ ప్రతి సమస్య పట్లా ప్రదర్శించగల్గిందా అంటే లేదనే చెప్పాలి. ప్రజల్లోవున్న బ్రిటిష్ వ్యతిరేకతను సరిగా అంచనా వేయలేకపోయింది. ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజల్ని సమీకరించే సందర్భంలో, మన మెడలపై కూర్చొని స్వారీ చేస్తున్న బ్రిటిషు ప్రభుత్వంఎడ చూపవలసిన నైఖరిలో సరియైన దృక్పథం లేదు. ముస్లింలీగు పాత్రను, పాకిస్తాన్ నినాదాన్ని సరిగా అర్థం చేసుకోలేదు. జాతుల స్వయంనిర్ణయ సూత్రానికీ, పాకిస్తాన్ నినాదానికీ ముడిపెట్టి, 'ముస్లిం జాతుల' నే ఒక కొత్త నిర్వచనం లేవదీయబడింది. ఈ పొరపాట్లన్నింటికీ మూలకారణం వలస దేశప్రజల పరిస్థితుల్నీ, జాతీయ మనస్తత్వాన్నీ, లక్షణా

లనూ అవగాహన చేసుకొని అందుకు తగిన ప్రచార పోరాట నినాదాలను ఇవ్వ లేకపోవడమేనని చెప్పాలి. అందుచేత ప్రజల్లో వున్న బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక క్రోధాగ్నినంతనీ సరైన మార్గంలో పెట్టి, నాయకత్వం వహించి నడపలేకపోయింది.

కాని అదే సమయంలో ఎన్ని పొరపాట్లు చేసినప్పటికి, తాత్కాలికంగా పార్టీ ప్రజలనుంచి దూరమైనప్పటికీ, మొదటి సారిగా కమ్యూనిస్టుపార్టీ బూర్జువా నాయకత్వానికి వ్యతి రేకంగా ప్రపంచ కార్మికవర్గ దృక్పథంతో ఒక స్పష్టమైన వైఖరి తీసుకొన్నది. దృఢనిశ్చయంతో ప్రవాహాని కెదురీది, ప్రజలతో సంబంధం పెట్టుకొని ఆత్మవిశ్వాసంతో పనిచేసింది. యుద్ధ కాలంలో ఫాసిస్టు వ్యతిరేక ప్రచారాన్ని తీవ్రంగాకొనసాగిస్తూనే ప్రజలనెదుర్కొన్న అనేక యిబ్బందులను, దైనందిన సమస్యలను తీసుకొని నిర్విరామ కృషి సాగించింది.

మిగతా పార్టీలు పోటీ సంఘాలుపెట్టి, ప్రజాఉద్యమాలను చీల్చినప్పటికీ, కమ్యూనిస్టుపార్టీ వర్గసంఘాల ద్వారాను, విద్యార్థి - యువజన - మహిళా మొదలైన ప్రజా సంఘాల ద్వారాను అనేక సమస్యలు తీసుకొని పనిచేస్తూ, ఆ సంఘాలను ఫంక్షన్ చేయించడం జరిగింది.

ఈ దశలోనే విశాలాంధ్ర, ఐక్య కేరళ నినాదాల్ని తీసు కొని ఆయా జాతీయ కళల్ని, వైజ్ఞానికరూపాల్నీ ముందుకు తీసుకువచ్చి ప్రచారంలో పెట్టింది. సారస్వత సభల్నీ, సాంస్కృ తిక అభివృద్ధినీ ప్రోత్సహించింది.

అన్ని రంగాల్లోనూ పనిచేస్తూ ప్రజల్ని అంటిపెట్టుకొని పార్టీ అభివృద్ధి చెందింది.

# యుద్ధానంతర ప్రజా వెల్లువ-
# 'ఆగస్టు స్వరాజ్యం'

ఫాసిజం పరాజయంపొందింది. ఫాసిజాన్ని ఓడించడంలో పాల్గొన్న దేశాలు, ఆ ప్రజలు తమ తమ ఉద్యమాల స్థాయిలు, తమ దేశాల పరిస్థితుల్నిబట్టి ప్రజాతంత్ర రాజకీయ వ్యవస్థలను స్థాపించుకొనడం ప్రారంభించారు. అలాంటి స్వాతంత్ర్యోద్యమాలలో భారతదేశం సంపూర్ణమైన భాగస్వామి కాకపోయినా ఆ ఉద్యమాలు మన దేశంలోని జాతీయ స్వాతంత్ర్యేచ్ఛను, ప్రజాతంత్ర అభ్యుదయ భావాలను తిరిగి రగుల్కొల్పాయి. అజాద్‌హింద్ ఫౌజ్‌లోని ముఖ్యుల విచారణలు భారత ప్రజల దేశభక్తిని ఉత్తేజపరచాయి. సైనికుల్లోకూడ ముఖ్యమైన మార్పు కల్గింది.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రజా ఐక్యత ప్రతి చోటా ప్రదర్శింపబడింది. కలకత్తా, బొంబాయిలాంటి మహా నగరాలలో బ్రహ్మాండమైన ప్రదర్శనాలు జరిగాయి. ఈ ప్రదర్శనాలను చూచి, కాంగ్రెసు లీగు నాయకులిరువురూ బెదరిపోయారు. సామ్రాజ్యవాదులతో రాజీకి మరల సంసిద్ధమయ్యారు.

కార్మిక సమ్మెలు సర్వత్రా వ్యాపించాయి. నౌకా, వైమానిక కార్మికులు సాగించిన సమ్మెలు బ్రిటిష్ పాలన బలహీనతను స్పష్టంచేశాయి. ఫిబ్రవరి 18 న బొంబాయిలో రాయల్ ఇండియన్ నౌకాదళంలో ప్రారంభమైన సమ్మె 19 వ తేదీకి 12 కేంద్రాలకు వ్యాపించింది. 20 వేల మంది సమ్మెలో

పాల్గొన్నారు. యూనియన్ జాక్ దించివేయబడింది. కాంగ్రెసు లీగు జెండాలు ఆస్థానంలో ఎగిరాయి. ఈ సమ్మె కరాచీకి వ్యాపించింది. భారతదేశంలో యివి అపూర్వ సంఘట నలు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి కీలక స్థానాల్లోనే నిప్పంటు కొన్నది. కాని కాంగ్రెసు, లీగు నాయకత్వాలు యీ సమ్మెను సహకరించకపోగా నిరసించాయి. అయినా ప్రజానీక మంతటి యొక్క సానుభూతి, సహకారాలు యీ సమ్మెదారులకు పుష్కలంగా లభించాయి. ఓడలవద్దకు ఆహారం సప్లయి చేయబడింది. ఈ తిరుగుబాటు నణచివేయడానికి బొంబాయి, కరాచీలకు మిలిటరీ పంపబడింది. భారత సైనికులు సమ్మె దారులను కాల్చ నిరాకరించారు. అప్పుడు బ్రిటిష్ దళాలు పిలిపించబడ్డాయి. ఈ బ్రిటిష్ దళాలతో నావికులు 7 గంటల కాలం పోరాడారు. ఒకవైపున నావికులకు సానుభూతిగా హర్తాళులు, ప్రదర్శనాలు జరుగుతూంటే, మరోవైపునుండి వల్లభాయిపటేలు యీ సమ్మెను నిరసిస్తూ ఆపివేయమని సలహా యిచ్చాడు. ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, కమ్యూనిస్టు పార్టీలు నావికుల కోర్కెలను, సమ్మెను బలపరిచాయి. పోరా టంలో 250 మంది నావికులు చనిపోయారు. అటు తర్వాతనే "మేము లొంగిపోతున్నది ఇండియాకేగాని, బ్రిటనుకు కాదు" అంటూ పోరాటాన్ని విరమించారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు పరిస్థితుల నర్థంచేసు కొన్నారు. నౌకా, వైమానిక, సైనిక తిరుగుబాట్లతోబాటు ప్రజల్లో అణగివున్న పోరాటశక్తులు ఒక్కసారి విజృంభించా యంటే, అవి ఏరూపం దాలుస్తాయో 1942 సంఘటనలు

జ్ఞాపకం చేశాయి. భారతదేశంలో పెంపొందివున్న బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యము, దాని ప్రభావము వాళ్ళకు తెలుసు. తమ బలహీనతను కూడ గుర్తించారు: అటు ప్రజల్ని, ప్రజా ఉద్యమాన్ని చూచి బెదరి, రాజీకొర కెదురు చూస్తున్న తమ మిత్రులను చేరదీశారు. సంప్రతింపులు, క్రిప్సు రాయబారాలు వగైరా నడిచాయి. పర్యవసానంగా 'మౌంట్ బాటెన్' ఎవార్డుతో ఒడంబడిక పూర్తి అయింది. భారత బడా బూర్జువా వర్గంలో ఒకభాగము, వారికి ప్రాతినిధ్యం వహించే నెహ్రూ ప్రభుత్వము సామ్రాజ్యవాదులతో లాలూచీపడి 'ఆగష్టు స్వరాజ్యాన్ని' తెచ్చుకొన్నారు. దేశానికి, ప్రజలకు ద్రోహం చేశారు.

బ్రిటిష్‌వాళ్ళు తెరవెనక్కు వెళ్ళారు. ప్రత్యక్షపాలన పోయింది. కాని పరోక్షంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మన దేశాన్ని రాజకీయంగా, ఆర్థికంగా, సైనికంగా తమ కబంధ హస్తాల్లో బంధించే వుంచారు. రాజకీయంగా అనేక షరతులతో కామన్‌వెల్తు రథచక్రాలకు మనదేశం ముడిబడి వుంది. ఆర్థికంగా మనదేశంలో బ్రిటిష్ పెట్టుబడుల ప్రాబల్యం, దోపిడీ యథా రీతిగా కొనసాగిపోతోంది. ఆ పెట్టుబడులపై లాభాలకు రక్షణలు, హామీలు, మన రాజ్యాంగ చట్టంలో వున్నాయి. సైన్యంలో కీలక స్థానా లన్నింటిలోను బ్రిటిష్ ప్రాబల్యం వుంది.

మన దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం వచ్చిందనుకోవా లంటే, బ్రిటిష్‌వాళ్ళకు మన దేశంపై వున్న అన్ని పెత్తనాలూ పరోక్షంగాకూడ లేకుండాపోవాలి. మన పరిశ్రమల అభివృద్ధికి పూర్తి ప్రోత్సాహము, రక్షణలు ఏర్పడాలి. ముఖ్యంగా ప్ర

శ్రమాభివృద్ధికి అవసరమైన పరిస్థితులు మన దేశంలో కల్పించబడాలి. అందుకు ముఖ్యంగా ఆటంకంగా వున్నట్టిది మన వ్యవసాయ విధానం. భూసంపద అంతటిపైనావున్న కొద్దిమంది పెత్తనాన్ని తొలగించి ఫ్యూడల్ భూస్వామ్య సంకెళ్ళను బ్రద్దలు చేయాలి. దున్నేవానికే భూమిపై హక్కును సంక్రమింపజేయాలి. వ్యవసాయ సమస్యను పరిష్కరించడం ద్వారానే మన దేశంలోని కరువు సమస్య, నిరుద్యోగ సమస్య, పరిశ్రమాభివృద్ధి సమస్య మొదలైన ప్రధాన సమస్యలన్నీ పరిష్కారమౌతాయి. అప్పుడే మన ప్రజలు కోరిన సంపూర్ణ స్వతంత్రంయొక్క ఫలితా లనుభవించగల్గుతారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పరోక్ష పెత్తనాన్ని, ఆర్థిక దోపిడీని రద్దుచేసే, వ్యవసాయంపై ఫ్యూడల్ సంకెళ్ళను బ్రద్దలుచేసే, ప్రజాతంత్ర వ్యవస్థను స్థాపించడమే, నిజమైన స్వాతంత్ర్యం. అట్టి సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించేందుకు అవసరమైన కార్యక్రమాన్ని, మార్గాలను కమ్యూనిస్టుపార్టీ వివరంగా భారతప్రజల ముందుంచింది. ఆ మార్గా న్ననుసరించడం ద్వారానే భారత జాతీయ ఉద్యమం యొక్క లక్ష్యాన్ని సాధించి ప్రజాతంత్ర ఉద్యమం పురోగమించ గల్గుతుంది.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B165 |
| పుస్తకం పేరు | భారత జాతీయోద్యమ సంగ్రహ చరిత్ర |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | R. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Pragathi |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |